రేచుక్క గ్రంథమాల—2వ ప్రచురము.

# ప్రతిజ్ఞాపరశురామము

(౫ రంగముల నాటకము)

వడగ కౌస్తుభము కవి గారిచే.








[illegible] రు 0-14-0.     గ్లేజు 1-0-0.

For copies apply to –

**Vadaga Koustubham,**

***Secretary, "Rechukka Grandhamala"***

BERHAMPUR, (Ganjam.

**Established 1927:—**

సంపాదకులు:-వడగ సుదర్శనముగారు, బొంతలకోటమూరు.

[illegible] వడగ కౌస్తుభముగారు.

రేచుక్క గ్రంథమాల,

రు—బరంపురం (గంజాం).

**Published by "Rechukka Grandhamandali"**
***Big Bazzar, Berhampur***
**(Ganjam.)**

**Printed by S B. Rath,**
**The ASHA Press,**
**Berhampur**
**1927.**

# రాజపోషకులు.



(1). మ॥ రా॥ రా॥ శ్రీ రాజా వెలుగోటి కృష్ణయాచేంద్ర బహద్దర్ వారు, వెంకటగిరి రాజా వారు, వేంకటగిరి.

(2). మ॥ రా॥ రా॥ శ్రీ సురభి వేంకట లక్ష్మారావు నిజాం నవాబ్ వంతు బహాదూర్ రాజాఆఫ్‌జటప్రోలువారు, జటప్రోలు

(3). మ॥ రా॥ రా॥ సాహేబ్ మెహర్బాన్ శ్రీ కమ్మినాయని జవ్వాజి వెంకటపతి నాయుడు బహద్దర్ వారు, జమీందార్ వారు, కంగుంది సంస్థానం, ఉత్తరార్కాడు జిల్లా.

(4). మ॥ రా॥ రా॥ ఇజ్జతాసార్ కందుకూరి బాలసూర్య ప్రసాదరావు బహద్దర్ జమీందార్ ఆఫ్ దేవిడీవారు, దేవిడి.

(5). మ॥ రా॥ రా॥ శ్రీ రాజావత్స వాయ సూర్యనారాయణపతి రాజ బహద్దర్ వారు భీమవరపుకోట, తూర్పు గోదావరి, జిల్లా.

(6). మ॥ రా॥ రా॥ శ్రీ తడికమళ్ల సీతారామచంద్ర రావుగారు, జమీందారు వారు, ఖేలవోలు, నల్లగొండజిల్లా. (నైజాం)

(7). మ॥ రా॥ రా। ఎమ్. వి. సీతారామా రావుగారు,
తిలారు వగైరా ఎస్టేట్ల జమీం
దారు వారు, బొంతలకోడూరు.

(8). మ॥ రా॥ రా। ఎమ్. వెంకటప్పారావు బహద్దర్
తిలారు జమీందారువారు తిలారు

## పోషకులు

1. మ॥ రా॥ రా॥ మోతే నారాయణరావుగారు, ప్రొప్రై
టరు అంకు ల్యాండులార్డ్సు పలూరు.

2. మ॥ రా॥ రా। అయ్యగారి మోహనరావు పంతులు
గారు, బి.ఎ బి.ఎల్ వకీలు, పార్వతీపురం

3. మ॥ రా॥ రా। ఎర్రమిల్లి సూర్యప్రకాశ రావుగారు,
బి.ఎ.బి ఎల్. వకీలు, రాజాం.

4. మ॥ రా॥ రా॥ వరదా కామేశ్వరరావు నాయుడుగారు,
ప్రొప్రైటరు, అండు ల్యాండు లార్డ్సు,
పూండి.

5. మ॥ రా॥ రా। మన్నం శేషాద్రి రెడ్డి గారు, సర్కి,
గుంటూరు.

6. మ॥ రా॥ రా। వడగ వీరన్నగారు, ప్రొప్రైటర్సు, ల్యాం
డులార్డ్సు, అండు కైసుమిల్ ఏజంట్సు
పొందూరు.

7. మ॥ రా॥ రా॥ దున్న కేశవరావుగారు, దివాన్ ఆఫ్ కల్లికోట, కల్లికోట.

8. మ॥ రా॥ రా॥ మొదానొ గాడోగారు, అప్పర్ బర్మా కంట్రాక్టర్లును, "ఆయుర్వేద దర్పణ" మను యుద్గ్రంధరత్న ప్రకాశకులును "స్వాస్థ్య" మాసపత్రికా సహాయులును, బరంపురం, అప్పర్ బర్మా.

9. మ॥ రా॥ రా॥ చిన్నం రామస్వామిగారు రైల్వేపార్సిల్ క్లర్కు, విజయనగరం.

10. మ॥ రా॥ రా॥ చగువుల మల్లికార్జున స్వామిగారు, ల్యాండు లార్డ్సు, చంద్రయ్యపేట.

11. మ॥ రా॥ రా॥ మంప సూరప్పడుగారు, ల్యాండు లార్డ్సు అండు ప్రొప్రైటర్సు, కిర్మవరం.

12. మ॥ రా॥ రా॥ బస్వ సూర్యనారాయణగారు, ప్రొప్రైటరు, అండు ల్యాండులార్డ్సు అల్లినగరం.

13. మ॥ రా॥ రా॥ బాసా అప్పన్నగారు, ల్యాండులార్డ్సు, టోలుగేటు కంట్రాక్టరు, అల్లినగరం.

14. మ॥ రా॥ రా॥ మలిపెద్ది అప్పన్నగారు, రైసుమిల్ ప్రకాశకులు అండు జనరల్ మర్చెంట్సు అల్లినగరం.

15 మ॥ రా॥ రా॥ ఆట్ల శివరామయ్యగారు, మర్చెంట్సు అండ్ కౌన్సిలర్ మెంబరు, సోంపేట

# సహాయులు

1. మ॥రా॥రా॥ శిత్తి బలరామయ్య నాయుడుగారు, ల్యాండులార్డ్సు, బారువ.
2 మ॥రా॥రా॥ మాదుగుల రామమూర్తిగారు జనరల్ మర్చెంట్సు అండు ల్యాండులార్డ్సు, ఢిల్లి నగరం.
3. మ॥రా॥రా॥ గుంటుకు లత్సప్పడుగారు, మర్చెంటు, బరంపురం.
4. మ॥రా॥రా॥ తూతిక దాలయ్యగారు, పట్టుబట్టల వర్తకులు, బరంపురం.
5. మ॥రా॥రా॥ గుంటుకు బుచ్చిబాబుగారు, ల్యాండు లార్డ్సు అండు మర్చెంట్సు, నేశేరు
6 „ గుంటుకు సూరప్పడుగారు, మర్చెంటు పెద్దమురపాక
7 „ మాదుగుల అప్పారావుగారు, మర్చెంటు, జాడపేట
8 „ మాదుగుల కైలాసంగారు, మర్చెంటు, చంద్రయ్యపేట
9 „ చదువుల సోమన్నగారు, ల్యాండులార్డ్సు మర్చెంటు, శిగడాం

# పీఠిక.

నాటకములను వ్రాయుటలో బాల్యదశ నగుటయే గాక నాకిదియే ప్రథమప్రయత్నమగుటను, ఇందెన్నియేని పొరపాటులుండవచ్చును. గాని పండితులగు మహాత్ములు వాటిని సరకుగొనరను ధైర్యమును, బాల్యచాపలము మరింత ప్రోత్సహించుటచే నేనీ "రేచుక్క గ్రంథమండలి" వారికోరిక ప్రకారము ఈనా నాటకమును వారిగ్రంథమాలలో ద్వితీయ ప్రచురముగాఁ బ్రచురించుకొనుటకు సమ్మతించితిని. బాల్యందశనై, నాటక రచనమునఁ బ్రథమ ప్రయత్నమున నిలచిన నా గ్రంథమును సంతోషముతోఁ దమ గ్రంథమాలను బ్రచురించి నాకపరిమితమగు ప్రోత్సాహము గలిగించుటచే సదరు గ్రంథమండలి వారికెంతయు కృతజ్ఞుఁడనగుటయేఁ గాక; ఇందలి దోషములెఱిఁగించిన మహానీయులకుగూడ అనేక నమస్కారములాచరించుచున్నాను.

| | |
|---|---|
| బరంపురం<br>20-10-27 | ఇట్లు, బుధజన విధేయుడు,<br>వడగ కౌస్తుభము. |

# సంపాదకీయ భూమిక.

మేమీ “రేచుక్క” అనుపేరున గ్రంథమాల నెట్టిదుర్ముహూర్తమునస్థాపించి, అందు ప్రథమ ప్రచురణముగా భక్తవత్సల శతకమును బ్రచురింప నచ్చొత్తించుచుంటిమో నాటినుండియు నెన్నియో విఘ్నములు సంప్రాప్తమగుచు గ్రంథప్రచురణ కార్యములు కాటంకపెట్టుచుండెను. “ప్రథమ కబళే మక్షికాపాతః” అనువట్లు మొట్టమొదటనే ఈయూరిలో నున్న “వేగుఁజుక్క” గ్రంథమాల ప్రొప్రైటరుగారగు భాగవతుల నృశింహ శర్మగారు మేము “రేచుక్క” అనుపేరను గ్రంథమాలను స్థాపించి గ్రంథప్రచురణ కార్యము జరిపించిన యెడల మాపై శివిల్ క్రిమినల్ చర్యలు జరిపింపఁబడునని రిజిష్టరీ పుత్తరం మాకువ్రాయించిన సంగతి మా ప్రథమ ప్రచురమగు భక్తవత్సలశతకములోనే మా పాఠక మహాశయులందరికిని దెలిసియుండవచ్చును. గాని; పాపము నృశింహ శర్మగారు తమ తప్పు తాము తెలిసికొనుటచేఁ గాబోలు ఇంతవరకును వారి రిజిష్టరీ పుత్తరము ప్రకారము మాపై శివిల్ క్రిమినల్ చర్యలు జరిపియుండలేదు, అందుకు వారికనేక వందనశతంబు లర్పించుచున్నాము. తరువాత “దుర్గాదాసు” అను చరిత్రవిషయిక నాటకమును ద్వితీయ ప్రచురముగాఁ బ్రచురింప యత్నమని తెలియజేసితిమిగాని; అందుకును కొందరు దుర్మార్గులు తద్గ్రంథ

ప్రచురణమున కాటంకముఁ గల్పించుటచేఁ జింతతో
మేమా ప్రయత్నమునుండి మరలుకొని ఇప్పుడు ద్వితీయ
ప్రచురణముగా “ఈ ప్రతిజ్ఞా పరశురామమును” ప్రచు
రింపవలసి వచ్చినది. నాటకములను వ్రాయుటలోఁ ప్రథ
మ ప్రయత్నముననున్న బాల్యుఁడయ్యును గ్రంథకర్త తన
ప్రతిజ్ఞాపరశురామమును గొంత రసవంతముగనే చిత్రించె
నని చెప్పకతప్పదు. సాధ్యమగునంతత్వరలో మా మూఁ
డవ ప్రచురమగు “తులసీరామాయణము” (బాలకాం
డముతో) మరల మాచందాదారులను గలిసికొందుము
గాక!

కొంతలకోడూరు
తే 10-10-27

ఇట్లు, బుధజన విధేయుడు
వడగ సుదర్శనము.



# చెప్పు కేమి!

## పాఠక మహాశయులారా

జాగ్రత్త! జాగ్రత్త!! జాగ్రత్త!!!

భారతదేశమునఁ జిరకాలమునుండియుఁ బ్రసిద్ధి
కెక్కిన "రేచుక్క పగటిచుక్క దొంగల" దగావనులు
గల కథలనుమాత్రమే మనమందరమును వినుటయేగాక,
చూచికూడా ఉన్నాము. కాని, ఆదొంగలనుమాత్రము
మనమెన్నఁడును చూచియుండలేదు. అయినను, ఆదొంగ
లో, అట్టిదొంగలో మాబరంపురంలో నేవుండి తదితరుల
కు పనికిమాలిన గ్రంథములను బంపుచున్నారని ఇప్పుడు
"వేగుఁజుక్క గ్రంథమాలలోఁ బ్రచురింపఁబడుచున్న
కొన్ని గ్రంథములవలనఁ దెలియబడుచున్నవగుటచే" మే
మును గ్రంథప్రచురణ కార్యములలోనే యున్నవారము
కావున, మాకేమైన అట్టిదొంగలవలన ఆయాసము కలు
గునేమోయని కట్టింపుజాగ్రత్తతో నెంతగనిపెట్టినను
మాకా "రేచుక్క పగటిచుక్కదొంగలు" గాని, అట్టి
దొంగలఁ బోలిన దొంగలుగాని మాకంటికిదివరకు గనఁ
బడలేదు గాని, దొంగలలోకమునకు నాయకుఁడనఁబరగి
"రేచుక్క పగటిచుక్క దొంగలపైఁగాని, అట్టిదొంగల
బోలిన దొంగలపైఁగాని తానుచేసిన దగాదొంగవను
లన్నిఁటిని ద్రోసివేసి యేమియు నెఱుఁగని మహాత్ముఁడు

వలె సంచరించుచున్న దగుల్బాజీ "వేగుఁజుక్క దొంగకోఁ
డు" మాకంటికి కనఁబడెను! అందుచే మాకపరిమితము
గు భయముకలుగుచున్నది. కావున, మహాశయులారా!
భాషాభిమానులగు తమయావన్మందియు "ఏమియు
నెఱుఁగని పెద్దమనిషివలె సంచరించుచు, దాను చేసిన
దగాదొంగపనులన్నిఁటిని రేచుక్క పగటి చుక్క దొం
గలపైఁగాని, అట్టిదొంగలఁబోలిన దొంగలపై గాని ద్రో
సివేసి "దగుల్బాజీ" బిరుదుతోనున్న దొంగలనాయకుఁ
డగు "వేగుఁజుక్క గజదొంగ" మాయపరివర్తనమున
కొంతమాత్రమును మోసపోకుందురుగాక!" అని మిమ్ము
వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాము!

* "దగుల్బాజీ వేగుఁజుక్క గజ దొంగ ఉన్నాడు!
జాగ్రత్త!—"



# ఈ నాటకమున వచ్చు పాత్రలు.



పురుషులు.

కార్తవీర్యార్జునుఁడు—మహిష్మతీ పురపురాజు.
చంద్రగుప్తుఁడు—కార్తవీర్యార్జునుని మంత్రి.
జమదగ్ని—పరశురాముని తండ్రి.
పరశురాముఁడు—జమదగ్ని కుమారుఁడు.
ఈశ్వరుఁడు—
అకృతవర్ణుడు—పరశురాముని మిత్రుఁడు.

స్త్రీలు.

మనోరమ—కార్తవీర్యానని పట్టపు మహాదేవి.
పార్వతి—ఈశ్వరుని భార్య.
రేణుక—జమదగ్ని మహాఋషి భార్య.





# ప్రతిజ్ఞా పరశురామము

## నాంది



చ॥ అనుపమయోగ సంయుతుని, ఆశ్రితకల్పుని, పా
ర్వతీమనో । ధనుని, కృపాసముద్రుని, ముదంబలరా
రఁగఁ గొల్చి శత్రులన్ । రణమున గెల్చినట్టి భృగు
రాముఁడు, రాముఁడు సర్వసంపదల్ । ఘనమగుకీర్తి
సంగతులఁగల్పి కొమసంగుచు మిమ్ము బ్రోచుతన్॥

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి సభాసదులను జూచి)

మహనీయులగు నో సభాసదులారా! భరద్వాజ గోత్ర పవిత్రుఁడును, సూరమాంబా లత్ప్వనల కనిష్ఠ కుమారుఁడునగు వడగ కౌస్తుభముచే రచింపఁబడిన "ప్రతిజ్ఞా పరశురామము" అనునూతన నాటకమొండు తమయెల్లరి సమక్షమున నేఁడు ప్రదర్శింప ననుజ్ఞ వేఁడుచున్నాను (అనికొంచెము ముందుకునడచి) ఏమని సెలవిచ్చుచుంటిరి?

## నాంది

గీ॥ లోకజాలంబు రక్షించు శ్రీకరుండు
పరశురాముండునై పుట్టి వరలుకతన
ప్రథిత రసవంతమైన శ్రీపరశురామ
చరితమాడిన తెన్నియా పరగెయగును॥

అనియా? అట్లయిన నిప్పుడే లోనికిఁబోయి వల యుపాత్రల సిద్ధముఁజేయించెదను సెలవు.

(అని నిష్క్రమించును)

(యవనిక జారును)



శ్రీరామచంద్ర

# ప్రతిజ్ఞా పరశురామము.

## ప్రథమాంకము — ప్రథమరంగము

## స్థలము—హిమాలయ ప్రదేశము.

---

(ప్రవేశము-మునివేషమునఁ బరశురాముఁడు)

పర॥ (హిమాలయపర్వతమును జూచి యాశ్చర్యముతో)
ఆహా! ఏమి ఈ హిమాలయపర్వతరాజ సౌభాగ్యము! ఎంతచూచినను తనివి తీరకున్నది కదా! (అని మీఁదికిఁజూచి) ఓదయామయా! సకలలోక రక్షకుఁడవగు నీసృష్టి మహాత్మ్యమును వర్ణించుట కెవరికి తరమగును? (అని మఱలఁదిలకించుచు) ఎంతసంతోషకరముగనున్నది?

సీ॥ పటుతరఘోరమౌ భద్రేభములతోడఁ
గడుభయంబొసఁగెడు కపులతోడ
సంహేలారావమౌ శార్దూలములతోడ
నతిభయంకర వరాహములతోడ
ఏణులఁ తోఁగూడు పేణాచయముతోడ
కోకిలారావ సంకులముతోడ
లేఁతపచ్చికమేయు లేళ్లసంఘముతోడ
ప్రీతిగొల్పెడు చిల్కపిండుతోడ

గీ॥ భీతిఁగొల్పెడు ఘన ఫణిజాతితోడ
సంచరించెడు భల్లూకసమితితోడ

నొప్పి, కడువింతమైయొప్పి, చెప్పరాని
నిత్యసంతోషమైయుండి నెగడుచుండె॥

(అని మఱలఁ బ్రక్కకుఁ గనుఁగొనుచు)

అయ్యారే! ఈదెస ఎంతరమ్యముగాఁ గానుపిం చుచుండెనో! ఓహిమాలయపర్వతరాజమా! నీకిదే వే యి నమస్కారములు! లోకరక్షకుఁడగు శ్రీవిష్ణుని పాద కమలములఁ బుట్టి దేదీప్యమానమై, సకలచరాచర జం తు జాలములకు ప్రాణతుల్యమై లోకపావనియై విలసిల్లు గంగాభవానిని గన్న పుణ్యమతివి! నీయట్టి శుభచరిత్ర మును, నీయట్టి విఖ్యాతిని, గాంచుటకు వేరొండు నగము లకు దుర్లభముగదా! (అని మఱల హిమాలయమునుఁ గనుఁగొనుచు సంతోషముతో)

సీ॥ ఇదెకదా పావని. ముదితగౌరీదేవి
పుణ్యంపురాశికిఁ బుట్టినిల్లు
ఇదెకదా ఈశుని కెంతోహాయినిఁగూర్చు
శృంగారమంగళాశ్రిత వనంబు
ఇదెకదా త్రిదశుల కెల్ల వేళలయందు
ఉనికిపట్టయయుండు ఉప్పరిగము
ఇదెకదాహిమమున కిరవై వెలింగెడు
పర్వతరాజ ప్రభావతేజ
గీ॥ ఇదెకదా యోషధులకెల్ల సదనమగుచుఁ
దగినశృంగారరంగంబు, తాపసులకు

ఇదెకదా తపమునల్పుట కెనయుచోటు
ఇదెకదా మూఁడు జగములకుఁ బుణ్యకొలువు।

బలే! ఎంతసౌభాగ్యము! ఎంతమనోహరత్వము! కన్నులుకలిగున్నందులకీ మహోన్నత పర్వతరాజమునుఁ దిలకింపకున్న నింకజన్మమేల? ఈపుణ్యప్రదేశమునుండియే

సీ॥ తాళవృక్షధ్వజు తనయుగా వెలిఁగిన
భాగ్యశాలిని యైన పరమపుణ్య,
పరమేష్ఠిఁ గన్నయ్య పట్టియై యూతని
చరణంబులను బుట్టి సచ్చరిత్ర,
మీలయింటను బుట్టి నీలకంఠుని వశ
త్వముఁ జేసికొనినట్టి ధన్యశీల,
సవతిగర్వంబు విధ్వంసంబు గాఁ జేయు
జలశూన్యమును జేయు సత్వహృదయ
గీ॥ సకలపావని, రక్షకి, సత్యతేజ,
లలితవిభ్రాజవాహినీ రాజరాజ
తల్లి, భాగీరదీతల్లి ధైర్యవల్లి
యదిగో, పాఱుచునుండె సమ్మోదముగను॥

ఎంతయానందదాయకమై, శుభప్రదమై యలరారుచున్నది! జగన్మాతా, గంగాభవానీ, నీయందొక్కసారి స్నానమాడి మహేశ్వరునామమును బారాయణఁజేయు మహాత్ములకు సర్వార్థములొసంగుటకుఁ గల్పతరువువై యుండ, నీనిర్మలప్రదేశమున నెల్లప్పుడును తపం

బుఁజేయు పుణ్యజనులకెట్టి శుభప్రదములగు కైవల్యపద వు లొసంగుదువో సదా! జననీ సృష్టిస్థితిలయ కారకుండగు మహేశ్వరు నియర్ధాంగివై, యాశ్రితజనులకు కల్పవల్లివై నెగడు నీసమ్ముఖంబునందునే, నేనుఁగూడ నీశ్వరు పాద కమలముల ధ్యానించుచు మనోవాంఛాఫలసిద్ధిఁ బడసెదనుగాక!

ఉ॥ నీలగళున్, పరాత్పరుని, నీచవినాశుని, ఫాలనేత్రు
భ। క్తాళిని బ్రోచునట్టిపరమాత్ముని శర్వుని పావ దా
ల్పు, ము। వ్వేలుపు వంద్యు భర్గుని, వివేకము మీ
రఁగఁ గొల్చి పైని న । వ్వేలుపుఁ గాంచు వాఁడ
గడుఁ బ్రీతి వరంబుల బొందు వాడగా.

(అని యొక చోటఁ గూర్చుండి చేతులు జోడించుకొని మీదికి జూచి)

ఉ॥ హే! దివిజేంద్రవంద్య భువనేశ్వరి మానస పద్మరా
జ, ని। త్యోదయ భక్తకల్ప ప్రళయ ప్రకి భీకరరూ
ప భూతజా। లాది విలాసితా శ్రీకరనాదిగుణప్రతిభా,
మురారి, శ। ర్వా, దినమిత్ర, చంద్రధర, ఆత్మ వి
రాజిత చంద్ర శేఖరా॥

ఉ॥ హే సకల ప్రపూత గణ మౌళిక హే ఫణి రాజభూ
ష హే। భాసురచంద్రధార మునివందిత, సత్వ విలా
స వాస, ప। ద్మాసన తేజ, రజ్నగిరి భాస విభూతివిలా
స శ్రీశ త్వ। ద్భాసుర పంకజద్వయము భక్తినిగొల్చె
ద భక్తరక్షకా.

(అని జపమాలఁ జేతఁబూని ఈశ్వరు నామస్మర
ణంబుఁ గనులుమూసికొని చేసికొనుచుండును)

(అంతఁ బార్వతి పరమేశ్వరులు ప్రవేశించెదరు)

పార్వ—(ఈశ్వరునిఁజూచి) నాథా, ఈ హిమాలయప్రాం
తమున నిత్యోత్సవములఁ గనుపుచుఁ జూచువారలకు
అమందానందమై యుండుటచే ప్రతిదినమును ఇచ్చట
విహారముఁ జేయుచున్న మనకే తనివిఁదీరకున్నది కదా

ఈశ్వ—(నవ్వుచు) అవును. నీవనినది సత్యము. సకలపాప
వినాశకరంబును, సౌభాగ్యప్రదంబును, తాపస నివాస
యోగ్యంబును, పుణ్యనదీజల ప్రవాహ మనోహరం
బును, అగు ఈరమ్యస్థలమెట్టివారికిని కనులపండువగు
చుండుటచేఁ దనివితీరకుండును! దీనికేమిగాని (అని)
(చేతితోఁజూపుచు) ఆవైపుఁ గనుఁగొనుము. ప్రేమ
పరిపూర్ణులగు భార్యాభర్తల యనురాగ బంధమువలె
ఒకటికొకటి కలిసి మనోహరమై వెలుగఁగొనుచున్నట్టి
పుష్పలతలెల్లు కనుల కానందమయమై విలసిల్లు
చున్నవి!

పా—(చూచి సంతోషించుచు) ఈయపూర్వ విచిత్రములు
చూచుచుండుటచే నాహృదయము అపరిమిత సంతో
షమున నోలలాడుచుఁ ప్రతిదినమును ఈరమ్యస్థలము
నాకొకవింతగనే కనఁబడుచున్నది! కావున మరికొం
చెము ముందుకు నడచి విశేషములరయుదము
రండు.

ఈ—(నవ్వుచు) పార్వతీ, నీవుముగ్ధవైనను పుణ్యక్షేత్రా భిలాషచే మార్గాయాసమును మఱచి ఇంకనునడచు టకు ఇచ్ఛగించుచుంటివి కదా!

పా—లోకమూర్తులగు తమసమక్షముననుండుటచే నాకా యాస మెట్లువచ్చును? అదియునుగాక; సంతోష సంబంధమునఁ గష్టములు కానుపించవుకదా!

ఈ—(నవ్వుచు) అట్లయినరమ్ము. (అనియిరువురుఁ గొం చెము ముందుకునడచి యొకవైపు (వేలితోఁజూపు చు) చెలీ, ఆప్రదేశమొకసారిఁ గనుగొనుము;

సీ॥ మున్ను భగీరథుఁ డున్నతచిత్తుఁడై
భాగీరథింగొన్న భవ్యసీమ
గగనపథమునుండి కడువేగయంబున బావికి
గంగయే తెంచిన ఘనపవనము
సకలజీవములకు సంచారయోగ్యమై
సౌఖ్యమిచ్చెడునట్టి సరససీమ
ఘనపాపములనెల్ల ఖండింపఁగల్గుత
రంగమాలికలొప్పు లలితసీమ

గీ॥ పరిమళంబులకెల్ల నింపైనసీమ
తానమునకైన పరమసీమ (అనినవ్వుచు)
గౌరిపరమేశులకు క్రీడ • గలుపుసీమ
గాంచుమెలనాగ యల్లదే • కన్నులారఁ

పర—(కనులు తెరువకయే) హే! జగదేకపాలకా! పార్వతీ మనోహరా! మాంపాహి! మాంపాహి. మాంపాహి.

పా—(విని భర్తనుచూచి) దేవా! వింటిరా! ఆమహాత్ము డిచ్చోట నెందులకై తపంబుసల్పుచుండెనో యించుక గనుంగొనిన బాగుండును!

ఈ—దేవి! ఈతఁడు పరశురాముడు విష్ణ్వంశసంభూతుఁడై పుట్టి కొండొకకాలంబునకై తపంబుజేయుచుండెను.

పా—అట్లయినవానిని కృతార్థునిగా జేయ జాలమేల జేయుచున్నారు?

ఈ—దేవి! ఇంచుక తాళుము. ఆతనిమనో ధైర్యమును గొంతవఱకు గనిపెట్టెదమురమ్ము (అని పరశురాముని దగ్గరకువెళ్లి) ఓ మునికులసార్వభౌమా, ఏమి నీ వైఖరి.

గీ। వేల్పులకు నెల్ల దూరమై ప్రీతికాని,
వల్లకాడులనివసించు ఈశ్వరుఁడదేమి,
అకటా! నిన్ బ్రోవ ప్రత్యక్షమగుటయేమి,
వానినింగొల్వ లాభమావంతయగునె,

పర—(వినికోపముతోఁ గనులుతెరచిచూచి కిరాతరూపముతో నెదుటనున్న పార్వతీపరమేశ్వరులను పోల్చుకొనలేక) ఓరీ! మూర్ఖా! ఎంతమాట ప్రేలితివిరా! సృష్టిస్థితిలయ కారకుండగు నాథ గనంతుని దివ్యతేజ

మునకు కానివనియొకటికలదా! హరహరా! ఎంత మాట బలికితివి!

సీ॥ సకలజీవులచేత సన్నుతుల్ గొనువాడు,
బక్తులమనములన్ వరలువాడు,
ఆదిమధ్యాంతంబు లెదదలంచెదువాడు,
ధవళచ్ఛాయలమోము దనరువాడు.
మేటిరక్కసకోటి నేటగల్చెడువాడు,
కరుణాప్రపూర్ణమౌ కనులవాడు,
భవ్యతరంగిణీ భాగీరథీనదిన్
దివినుండివదలిన దేవవిభుడు,

గీ॥ అంబికాధవుడార్త రక్షాధనంబు,
లోకమూర్తియు, త్రిభువన శ్రీకరుడు,
నైనశర్వుండు నాకు నింపె నయగాను
కోర్కెలిడవేడో? చాలించుమిచ్ఛి తాత్మ.

నీచుడవగు నీబోటివారలకా మహాత్ముడు దూరస్థుడేయగును. ఎలననగ :—

ఆ॥వె॥ కానలందుజన్మ కాలంబుబుచ్చుచు
జీవకోటిబట్టి చంచి తినెడు
నీవదేడ భక్తపావనుండతడేడ
బేలకుండనింక వెళ్లుపొమ్ము.

ఈ॥ (నవ్వుచు) సరి. సరి. మంచిమాటబలికితివి. వీరంత సర్వేశ్వరుడని పలుకుచుంటిరిగాని; అతనిన గతి తెలియని వారెవరు?

సీ॥ తినుటకన్నము లేక ఘనవృత్తి జేదాల్చి
భిక్షుకత్వంబున వెలుగువాడు,
నిలువనీడయె లేక తెలవు శైలముపైని
వాసముం జేయుచు వరలువాడు,
కట్టబట్టలు లేక కడుభయంకరమైన
పులితోలుకట్టి పెంపొలయువాడు,
తొడగవస్త్రవు లేక పడగలధరియించి
వల్లకాటులనుండ వరలువాడు,
గీ॥ సఖులుఁగా ఘోరపిశాచములను,
సఖులఁగాఁగొని వాటిసంచారసీమ,
సంచరించెడు భర్గుఁడే చందమునను,
వరములిడు? వట్టియాయాన మరయ నేల.

శర—(కోపముతో నిలువఁబడి) ఓరీ! నీచాధమా! లోక రక్షకుఁడగు మహేశ్వరుని నోటికొలఁది ప్రేలుచుండుట కింతకన్నగానకుంటివా యేమి? ఇచ్చటనుండి పోయెదవా లేదా?

చం॥ వనములఁ గొండసీమలను వాసముఁ జేయుచుఁ దుచ్ఛ
బుద్ధిచే నరయుమజీవకోటులను సంతముఁ జేయుచుఁ
బొట్టనింపుకొంచును జరియించుమూర్ఖుఁడవు, శుద్ధ
పరాత్పరమూర్తియైన యా యీశ్వరునిఁ గేలిసేయు
దువె యోరి కిరాతక! నీచకాధమా!

ఇంకనీ ప్రాణములను గాచుకొనియుండుము. (అని బాణము సంధించి ఈశ్వరునికొట్టఁబోవును).

ఈ—(నవ్వుచు) ఓహో! పరశురామా! నీభక్తికి మెచ్చితిని. నీకిష్టమైన వరములనుగోరుము.

పర—(ఆశ్చర్యముతోఁ గొట్టుటకెత్తిన బాణమును దిగవిడచి) మహాత్మా! నీమాయఁగనుఁగొనలేక ననేకవిధములఁ దూలనాడితిని క్షమించి రక్షింపుము.

(అని పాదములపైఁబడును)

ఈ—(నవ్వుచు పరశురాముని లేవనెత్తి) మునిసార్వభౌమా! నీమనోధైర్యమును బరిశీలింప నిట్లువచ్చి మాటలాడితిని. అందుకుమన్నించి నీకిష్టమగువరములను గోరుము?

పర—దేవా, అప్రమేయుఁడవు, ఆదిమధ్యాంతరహితుఁడవును, నిర్వికల్పసమాధి నిష్ఠాగరిష్ఠుఁడవగు నీ మాయఁ గనుఁగొన నేరికి తరమగును •

గీ॥ పద్మగర్భుండునైన నీమాయఁగాంచ,
లేక నిల్చుండ నేనెంత శ్రీమహేశ,
నిందఁజేసినతప్పు మన్నించుమింక,
పార్వతీనాథ శరణము పాదములకు॥

(అని సాగిలఁబడి మఱల నమస్కరించును)

ఈ—(లేవనెత్తి) వత్సా!—

పర—(అర్ధోక్తియాందే) మహాత్మా!

ఉ॥ పాపపు పంకదుంబనెడి పంకమునన్‌బడి లేవలేక నే
నీపదపద్మయుగ్మమును నెంచిభవత్కరుణన్ గనంగ ది

గ్వ్యాపకరూపమహానిజన, యార్త శరణ్య, మహాత్మ, శంకరా! ఈవగిదిన్ వశించితి మహేశ్వర, దీనదయా, త్మ బ్రోవుమా.

నీమహాత్వమునం జేసి నాశరీరము పవిత్రమయ్యె. పాపజాలముం బాసితి. బ్రహ్మేంద్రాదులైనం గనుగొనలేని భవదీయ దివ్యతేజము నేఁడు కనుఁగొంటిని. ధన్యుఁడనైతిని.

ఈశ్వ—(సంతోషముతో పరశువునందించుచు) వత్సా! ఇది పుచ్చుకొని దీనితో నీకార్యసాధనములకుఁ గడంగుము. ఇది జయకరమొసంగుచుండును.

పర—(అందుకొని కనులకద్దుకొనును)

ఈశ్వ—వత్సా! మేమింకఁ బోయెదము గాన నీవింక సౌఖ్యంబుగనుండుము.

పర—(సంతోషముతో) మహాప్రసాదము (అని నమస్కరించును)

ఈశ్వ—ఇష్టార్థసిద్ధిరస్తు-(అని ఆశీర్వదించి పార్వతితో నిష్క్రమించును)

పర —(సంతోషముతో) నేఁటికి ధన్యుఁడనైతిని గావున నింక నాయాశ్రమంబునకుఁ బోయెదనుగాక (అని పశ్చిమదిక్కుఁ గను గొని) అదిగో సూర్యభగవానుఁడు పశ్చిమసముద్రమునకుఁ జేరఁబోవుచుండెను.

సీ॥ తమమిత్రుఁడగురవి తమ్మునువిడునంచు
నెంచితమ్మలు గ్రుంకనెంచుచుండ,
తమనాముఁబోవుచోఁ దమమిత్రుగలియఁగ
గలువలుదలలెత్తి కాంచుచుండ,
నలగడలందున నల్లనౌచీఁకటుల్
గ్రమ్మఁబక్షులునిండ్ల కరుగుచుండ,
వన్యమృగంబులేవంకఁ గనుంగొన్న
నాహారవాంఛచే నరుగుచుండ

గీ॥ సాధుజంతువులన్నియు సదనములకు,
సాగుచుండెను, మిత్రుండుసాధ్వియైన,
ఛాయదేవినిగూడి యస్త్రాద్రికరుఁగ,
భళిర! భగవంతుసృష్టి సంపర్కమహిమ,
కావుననింక మా యాశ్రమంబునకుఁ బోయెదనుగాక!

(అంత తెరలో)

ఉ॥ ఓమహనీయులార! సుగుణోజ్వల దీనదయాళులార!
నే, భూమిసురేంద్రపుత్రుఁడను, బొల్పెసలారెడుగ్రో
వఁదప్పి నా। నాముఖవ్యాఘ్ర భల్లుక ఘనంబగుఘో
రవనంబునందు నో, హోమదిబెగ్గిలన్ వలసెనుక్కట
శెబ్బులి వాతఁజిక్కుచున్,

పర—(విని) ఎవరిదీయార్తధ్వని? ఎవఁడోయొకబాటసారి భల్లూకముజేఁజిక్కి కడుఁగడగండ్లఁ బడుచుండెను గాఁబోలు! వేగముగఁబోయి యా యార్తుని రక్షించెదను గాక!

(అని ముందుకునడచుచుండును)

(అంతలో రోజుచు అకృతవర్మ ప్రవేశించి)

అకృత—(పరశురామునిజూచి ధైర్యముతో) అమ్మయ్యా! బ్రతికితిని. మహాత్మా! నన్నొకబెబ్బులి తనపాట్టఁబెట్టుకొన వెంటఁబెట్టుచుండ దానిని దప్పించుకొనుచు వచ్చి తమదర్శనభాగ్యమును బొందియదృష్టవంతుఁడ నైతిని.

పర—(సంతోషముతో) అకృతవర్మా! ఎంతకాలమునకు మఱలనిన్ను గాంచఁగలిగితిని. రమ్ము భయములేదు మనమింకఁబోవుదము.

(అని అకృతవర్మతో నిష్క్రమించును)

(యవనిక జారును)



శ్రీరామచంద్ర

# ప్రతిజ్ఞా పరశురామము.

## ద్వితీయాంకము—ప్రథమరంగము

(స్థలము-జమదగ్నిమహాముని ఆశ్రమప్రాంతము)

(ప్రవేశము కార్తవీర్యార్జున చంద్రగుప్తులు)

కార్త—(విచారముతో)

చ॥ కటకట! యేమి సేతు, పెనుగాలిని గూడెడువాన పాలి
నం! కటమునఁజిక్కి సైన్యములు కష్టములందుచు
నిల్చియుండె ను! త్కటమగునాకలాకటఁ దెసఁగారియ
బెట్టుచునుండ నక్కటా! యెటులను నేమిసేతు శెర
వెద్ది మహేశ్వర, యిట్లు సల్పెసన్.

ఇప్పుడేవిధముగ నిజపట్టణమును జేరువారమో తెలియకున్నది? మాదురదృష్టమునకీ పెనుగాలియును, వానయును నెచ్చటనుండి దాపరించెనో కదా! ఈశ్వరా! నడచుటకుగూడ శక్తి జాలకున్నది, యేమిసేయదలంచినను నీదియేభారము! ముందుకింక నొకయడుగైనను నడువజాలను (అని చదికిలబడును).

చంద్ర—మహారాజా! తమ రేయి ట్లధైర్యపడినచోఁ దక్కి
న మాబోటివారలగతి యేమిటి?

గీ॥ ప్రళయమింకేమివచ్చెను వర్షపాత,
మునకు సైన్యంబులెల్లను పొలుపువిడచి,
యుండుచో నింతవగ వేల లెండు లెండు,
నిజనివాసంబులకుఁ బోవనిపుడు మనము.

అదియునుగాక; యీ పాటి స్వల్పవిషయమునకై
మనము డీలుపడిన నగుఁబాటు గాకుండునా? మరికొంచె
మోపిక వహించిన చో మనపట్టణము నమీపించవచ్చును.
లెండు.

కార్త—(లేచి) మంత్రీ! గాలికాకుడులకుగాని; వర్షపాత
మునకుగాని నేనిప్పుడు చింతిల్లుటలేదు. ఆకలి విస్తా
రముగనున్నది. కావున నెచ్చటనైన నిప్పుడింత యా
హారముదొరికిన బాగుండును.

చంద్ర—దేవా! ఈయుపవనముఁజూడ నిది పరమపావ
నుండగు జమదగ్నిమహాఋషి యాశ్రమమేమోయని
తట్టుచున్నది. కావున నిప్పుడామహాత్ముని దర్శించిన
చోఁ నమకేకాక మనసైన్యము లన్నింటికిని క్షుత్పిడఁ
దీరునమటకు సందేహమెంతమాత్రము నుండదు.

కార్త—మనసైన్యములన్నియు నొక్కచోటనేయుండెనా?

చంద్ర—ఒక్కచోటనే యుండవచ్చును గాని; కొందరు
మాత్రము ఆపెనుగాలి కాకుడులకు చెదిరి యుండె
దరని నాయభిప్రాయము.

కార్త—సరియే. అట్లయిన మనమిప్పుడా మహాఋషిని దిలకింపఁ బోవుదమురమ్ము

చంద్ర—మంచిది. (అనిరాజుతో నిష్క్రమించును.)

(యవనిక జారును)

---

## ద్వితీయరంగము

స్థలం జమదగ్ని మహాముని యాశ్రమము

' (ప్రవేశము జమదగ్నియు, అతనిభార్య రేణుకయు,)

రేణుక—దేవా! నాకొమారుఁడంకే నివసించి యింకను ఈశ్వరు నారాధించుచుండునా?

జ—(నవ్వుకొనుచు) ఇత్పుడతఁడు యోగమున లేఁడు నేఁడో రేపో మనవద్దకువచ్చును.

రే—అట్లయిన నాకుమారుని కార్యపర్యావసాన మెట్లుండె నని తలంచెదరు?

జమ—కాంతా! నీకుమారుఁడగు పరశురాముని కై నీవింతయేని విచారింప నవసరములేదు. అతఁడు సామాన్యుల వంటివాఁడుకాఁడు గాక; విష్ణ్వంశసంభూతుఁడని భావించుకొనుము. ఈశ్వరుని యనుగ్రహముఁ బొందియే వచ్చుచున్నాఁడు.

రే—మహాత్మా! అట్లయిన సంతోషమే.

జమ—దేవీ! జగదంతర్యామియగు భగవంతుఁడు దుష్టనిగ్రహశిష్టరక్షణార్థమై యుగయుగమందును అవతరించును. అట్టిమహాత్ముని దనయునిగాఁబడసిన నీజన్మ

యే జన్మము. కావున నతనిరాకకై ధ్యానముఁ జేసి
కొను చుందుము. నేనుగూడ యోగమునవలంభిం
చెదను.

రే— మహాప్రసాదము. (అని కనులుమూసికొని ధ్యానము
జేసికొనుచుందును)

(అంత కార్తవీర్య చంద్రగుప్తులు ప్రవేశించి)

కార్త—(జమదగ్ని మహాఋషిఁ జూచి సంతోషముతో
మంత్రీ! ఆ యోగిపుంగవుఁ దిలకించితివా? ఓహో! ఏమి
యామహాత్ముని దివ్యతేజస్సు! భార్యలపోరు భరింప
లేక, భూలోకంబునకు తపంబుఁ జేసికొనవచ్చిన శంక
రుఁడేమో యనునట్లుండెను

సీ॥ జడలనుసవరించి కడుఁ శెద్దముడివేసి
రుద్రాక్షమాలలు సూశిఁ జుట్టి,
మేనెల్లబూడిద మెరుపుఁ బూతనుబూసి
లలికమండలువు దాపలను దాల్చి,
గళము నెంతయును బంగరువన్నువులమాడ్కి
తులసిపూసల పేర్లతోనునింపి,
జేగురుఁగలుప చేలఁబులను నాన్లి
కాషాయవస్త్రముల్ ఘనతఁగట్టి,

గీ॥ ప్రక్క నెప్పుడుఁ జేడియ వరలుచుండ,
లోకసంబంధమైన దుర్మోహవార్ధి,
జిక్కకను దేవదేవుని చెలిమిఁగాంచి,
యోగముననిల్చు జమదగ్ని యోగిఁగనుమా.

చంద్ర—దేవా! తమరు సెలవిచ్చినటు లీమహాత్ముఁడు రెండవశంకరుఁడేమో యనునట్లుండెను. కావున బోయి దర్శించెదమురండు.

కార్త—మంచిది. (అని చంద్రగుప్తునితో జమదగ్నిని సమీపించి, చంద్రగుప్తునిఁజూచి) మంత్రీ! మహాత్ముఁడగు ఋషిచంద్రుఁడు యోగముద్రనునిల్పినట్లున్నది. కావున మనమిప్పుడెట్లు మహాత్ముని మేలుకొలిపెదము?

జమ—(కన్నులువిప్పి చూచును)

కార్త, చంద్ర—(ఋషి కన్నులువిప్పుటఁజూచి సంతోషముతో) మహాత్మా! నమస్కారము (అని యిరువురును సాగిలఁబడి నమస్కరింతురు)

జమ—ఇష్టార్థ సిద్ధిరస్తు.

కార్త, చంద్ర—లేచి నిలచుందురు.

జమ—(వారలఁగూర్చుండ నియమించి, రాజునుజూచి) కార్తవీర్యార్జునా! నీకు శుభమేకదా? వేటకై మకమున వచ్చి చాలవరకు నాయాసమునఁ జిక్కినట్లున్నదే?

చంద్ర—అవునుమహాత్మా! వర్షాతమునకును, గాలి తాకుడులకును జిక్కి చాలావరకు నాయాసపడితిమి.

జమ—(కార్తవీర్యునిఁజూచి) రాజా! నేటికిచ్చటఁ దమ గాతిథ్యము స్వీకరించి రేపఁటిదినము పయనమై పోవచ్చునని తలంచెదను.

కార్త — దేవా! నేనొక్కఁడనేనైనఁ దమయాజ్ఞచొప్పున
నిల్చియుందునుగాని; సైన్యసమేతముగవచ్చిన నేనెట్లు
తమయాజ్ఞ మన్నింపగలనో తెలియకున్నది.

జమ — (చిరునవ్వు నగుచు) రాజా! సైన్యముండినంత
మాత్రమున సంశయింపఁబనియేమియున్నది. సైన్య
సమేతుఁడవై యాతిథ్యము నందిన నాకుమరింత సం
తోషముగానుండును అదియునుఁగాక; మాకు మీ
వంటివారల నతిథిసత్కారమున సంతసింపఁజేయుట
యే పరిపాటి.

కార్త — (మంత్రితోఁ జూచి, ఋషికి వినబడకుండ) మంత్రీ!
వేనకొలంది వచ్చిన సైన్యముతో నీఋషి చంద్రుఁడు
కాతిథ్య మెట్లిచ్చును?

చంద్ర — (ఓహో! ఆ మహాత్మునకే తెలియును. మహాత్ము
లకు సాధ్యముకానిదేమున్నది?

జమ — (నవ్వుచు కార్తవీర్యునిజూచి) రాజా! అతిథ్యవిష
యమునకై నీవావంతయును విచారింపనవసరము
లేదు రమ్ము వనములోనికేఁబోయి ముందు సైన్య
మునకెట్టి తృప్తి విచారించెదము. (అని రేణు
కనుఁజూచి) దేవీ! ప్రభువగు కార్తవీర్యుఁడు సైన్య
సమేతముగా వచ్చియుండెను. తెమ్ము

రేణు — (కార్తవీర్యుని జూచును)

కార్త, చంద్ర } రేణుకకు నమస్కరింతురు.

రేణు—(సంతోషముతో) వాంఛాఫలసిద్ధిరస్తు!

జమ—రాజా! మనమింక సైన్యములవద్దకుఁ బోవుదము రమ్ము.

(అందరు నిష్క్రమింతురు)

యవనిక జారును.



## తృతీయ రంగము

స్థలము—జమదగ్ని ఆశ్రమసమీపము

(ప్రవేశము కార్తవీర్యార్జునుఁడు, చంద్రగుప్తుఁడు జమదగ్ని మహాఋషి)

కార్త—మునిసత్తమా; తమరెంతవచించినను నా కా కామధేనువొసంగినగాని నేనుఇచ్చటనుండి వెళ్లను. మీకుఁగావలసిన పదిలక్షలగోవుల నిచ్చెదనుగాని; యాకామధేనువునుమాత్రము నేను విడచిపోఁజాలను

జమ—రాజా! అతిథివి కదా యని ఆదరణముతో నాతిథ్య మునకుఁగల్పించి సమస్తసైన్యములకుఁగూడఁ దృప్తి బొందించుటచే నాకుగలిగించెదు ప్రత్యుపకారమా యిది? ఆకామధేనువు మానవమాత్రులకు లక్ష్య పెట్టదు. అదినీకిచ్చుటకుఁగూడఁ దగదు.

శాన్త—ఎందువలనీఁదగదు?

జమ—చెప్పుచుంటినిగదా! అది కేవలము గోవుగాదు. దేవలోక ధేనువు. అదినీవంటివారికడ యుండఁదగదు. యుండదు. కావున నీవాసించినఁబ్రయోజనము లేదు

శాన్త—దేవా! రాజునగు నాకుఁ గోరఁదగని వస్తువేది యుండును? అదియునుగాక; మీరు నాచే రక్షింపఁ బడుచున్న భూభాగమున నివసించుటచే మిమ్ములను గ వలసినంత కార్యమేమియును గనుపట్టదు అయినను మహాత్ములు గదా యని యడిగి మీచేఁబొందఁ గోరికను, నుంటినిగాని; కాదని తిరస్కరించినచో, రాజునగు నాయిష్టము చొప్పునఁ దీసికొనిపోవ గలదు- అని తమచిత్తము. అదియునుగాక.

గీ॥ రాజ్యచక్రంబు శాసించు రాజవరుఁడు,
గోవునొకగా గొనుటకుఁ జేసఁగనఁడె,
ధర్మమునకంటనుమీమూర్ఖుఁ బిలఁచియుండి
ఈయకున్నను బలిమి నేఁ గొనఁద.

జమ (కోపమునభించుకొని) రాజా!

గీ సాధుజనులను బాధించు సరసుఁడిలను
రాజురాణ్ణా నెందలఁపోయర జగత్ర
అతిథిసత్కారము మనీవు సంగ్రయించి,
సంతసంబునఁబొమ్ము ప్రశాంతమునికి.

లేకున్నచో నీకార్యము ఎంతమాత్రము గొవసా గదు నరేకదా; పైపెచ్చు నాశాపాగ్నులల కాహుతి వయ్యెదవని మామ్నాటికినినమ్ముము.

కార్త —(కోపముతో) ఏమీ! అంతటిపౌరుషమును జూపించుటకున్న మిమ్ములను యోగులనిదలచి నీక్షమును మోసంబోయితినన్నమాటయేం కాలేదు. కార్యాకార్యములు భగవధాధీనములు కదా? (మంత్రిం జూచి) మంత్రీ! ఆకామధేనువును బట్టకొనుటకు మన సైనికుల కాజ్ఞ యొసంగుము.

చంద్ర—చిత్తము. (సమస్కరించును)

జమ—రాజా! వలదుసుమా! హాని గలుగు కార్యము! నేనాధేనువు నొసంగజాలను. పరము నరు మారలి పోవుట మంచిది.

కార్త—మునిసత్తమా! క్షమించుడు! రాజునగుటచే నట్టి కామధేనువొకటి యుండవలెను-అదియునుగాక, నా యాస దానిపై బడుటచే నద్దానిని నాకొసంగక తప్పదు.

జమ—వలదు. నామాటవినుము అది సామాన్యములగు గోవులవంటిగోవుకాదు. దేవలోకపు కామధేనువు. యోగిజనులవద్ద నుండదగినదికాని; మీవంటి రజో గుణ సంపన్నులయొద్ద నుండదగినదికాదు. మరలిపో వుట యుక్తము.

కార్త — మరెన్ని చెప్పినను వినుటకు నామనస్సొప్పకున్నది, క్షమింపలేదు. పోవుచున్నాను. (నిష్క్రమించును)

జమ — (కోపముతో) ఓరీ! మూర్ఖా! పోవుచుంటివా? ఎల్లా కామధేనువును దీసికొని పోయెదవో నేనును గొంచెము జూచెదఁగాక!

(అది వడివడిగ నిష్క్రమించును)

(యవనిక జారును)

---

## చతుర్థ రంగము

స్థలము — మహారణ్యము

(ప్రవేశము రేణుక దుఃఖముతో)

రే — హా! నాథా!

చ॥ అడవిని యోగముద్రఁ బరమాత్మునిఁగూర్చి యహర్ని
శంబులనీ! గడు భయమహా సంబునను గాలముబుచ్చు
చునుండుమీకు ని య్యెడ నిటువంటి మృత్యువుమ
హేశ్వరుడిచ్చెనే? యేమిసేతు? న వ్విడచిమహాత్మ
నీవొకఁడ వేగదివే దయమాలినావయిన్.

అయ్యో! ఇంక నేనెట్లు జీవించుదాన? ఓరా! కార్తవీర్యార్జున హంతకా! మహాయోగధనుఁడగు నాథ రత్నమునంపి మాయాశ్రమ కామధేనువు దీసికొనిపోవుటకు నీకు మేము చేసిన యపకారమేమిటి? వక్షపాతమునకు

గడుబడలి సైన్యములతో నీవువచ్చినందుకు అతిథి సత్కా-
ర మొనరించినందులకా యిట్టిపాటు మాకు చేకూర్చుట?
రాజునని గర్వించి నిష్కారణముగ మహాయోగధనుండ
గు నాథర్తను జంపు మహాపాపము నిన్నుఁగట్టి కుడుప
కుండునా? మూర్ఖా! ఎంతపనిఁజేసితివి? అతిథివై, మృష్ట
మృష్టాన్నభోజనముల సైన్యములతోఁబాటుగాఁ దనివి
నొంది, కామధేనువుపైఁగల యాశను నాథర్తనుఁజంపి
నీమూర్ఖత్వమును లోకమునకుఁ జాటఁజూపెదవా?
అయ్యో! కాయ కసరేరుకొని తినుచు నట్టడవినిఁ దపంబు
నలుపుకొను మునులగు యోగిపుంగవులపైనా నీ
బాహుపరాక్రమము జూపించుట? ప్రాణేశ్వరా! ఈనట్టడ
వివి నన్విడచి చనుటకు నే మీపట్లఁజేసిన దోషమేమిటి?
నిముషమైన మిమ్మెడబాయకుండ మీపాదపద్మముల
నాహృదయతలమున రాత్రింబవళ్లు ధ్యానించుచుండు
నన్నిట్లొంటిమై విడచిచనుటకు మీమనస్సెట్లొడఁబడెను?
కుమారా? పరశురామా! నీతండ్రిగతి యెంతకువచ్చెనో
చూచితివా? మూర్ఖుండగు కార్తవీర్యార్జున హంతకుఁడు
మీతండ్రినిఁజంపి ఆశ్రమవాససౌభాగ్యమైన కామధేనువును
బలిమిని బట్టుకొనిపోయెను! తనయా! కన్నతండ్రి ఋణ
ముఁదీర్ప నింకనైననురావా? నాకీనడికానలో నింకదిక్కె-
వరు? హా పరమేశ్వరా! నాగతి యింతకుదెచ్చితివా!
ప్రాణేశ్వరా!

సీ॥ నిర్మలభావంబు నెరిమించనిర్మోహ
పాశబద్ధుండవై బాసినావె,
సంసారసారనిస్సార హీనంబని
ఎద నెంచి దివిలోకమేగినావే.
సత్యంబుకన్న నసత్యంబుకలదంచు
మించిసద్గతిఁగాంచ నెంచినావె,
భూలోకతాపసపొందు నింద్యమటంచు
దివిజతాపస పొందుఁదవిలినావె,

గీ॥ సకలధర్మస్వరూప పసందులేని। పాపభూయిష్ఠమైన
యీభరతదేశ। మందు నివసింపఁదగదని యతుల
సత్య। లోకమునకేఁతివె నాథ। ప్రాకటముగ.

అక్కటా! ఇంక నా రోదనమిచ్చట వినువారొక్క
రును లేరుకదా। కుమారా! పరశురామా! దిక్కుమాలి
యనాదనై యున్న నన్ను జూచుటకు నీవైన రాకూడదా?
తండ్రి। మీతండ్రి కామధేనువుకై కార్తవీర్యార్జున హ
తకునిచేతిలోఁ బ్రాణములు విడచెనను సంగతి నీకింకనుఁ
దెలియ లేదు కాఁబోలు.

చం॥ ఒకడ నృపపాంసనుండు మృగయోత్సుకతన్ బరగెంచి
దారిగాఁ నటి, నిటువచ్చి, యనాదరణనంది, తొలంగక
కామధేనువున్। ప్రకటమహానురాగమున వాంఛఁ
దలంచెను దానినీయమిన్। వికలమనన్ము [illegible]
బృధివీ[illegible]లిజఁ పెను నీదు తండ్రినిన్.

వింటివా! ఎంతటిదారుణసాహసమున కా మూర్ఖుఁడొడిఁగట్టెనో? కుమారా! ఇంకనైనను నీజాగుఁజాలించి నీ తండ్రి ఋణముదీర్ప సత్వరంబుగ రమ్ము. నిజముగ నీవేయున్న నాదుర్మార్గుఁడింత సాహసమునకు లోను గాకుండునుగదా! అయ్యయ్యో! నాకుమారునికీ సంగతి నెవ్వరు తెలియఁజేసెదరు?

(అంత పరశురాముఁడు ప్రవేశించి (తల్లింజూచి ఆశ్చర్యముతో)

పర—అమ్మా! నీవిట్లు చింతించుటకుఁ గారణమేమి? మహాత్ములగు నాజనకుఁడెచ్చట?

రే—(కుమారుఁగాగలించుకొని) హా! కుమారా! ఇంక నీజనకుఁడేమిటి? కార్తవీర్యార్జునహతకుఁడు నీతండ్రిని బొట్టను పెట్టకొని, కామధేనువును బలిమినిఁదీసికొనిపోయెను.

పర—(రౌద్రముతో బండ్లుపటపటఁగొరుకుచు) ఓరీ! కార్తవీర్యార్జున హతకా! ఎంతపనిజేసితివిరా!

మ॥ కరుణాలేశము లేకమజ్జనకు సంగ్రామంబునన్ గూల్చితీ! యన్ గావున; నట్లునిన్నిపుడ నిన్ ఖండించి తద్రక్తము న్! కరమొప్పంగను బితృతర్పణమునంగావింపనేనిన్, మహా! నరకంబందునఁబితృఘాతినగుచున్ కష్టుండఁగాకుందునే.

(అని తల్లనిజూచి)

అమ్మా! నీవిచ్చట ధైర్యముతోఁ గొన్ని దినములు భగవద్ధ్యానతత్పరతచేఁ గాలముఁగడుపుచుండుము. నేనామూర్ఖుని యిప్పుడేపోయి యమసదనమునకంపి, నా తండ్రిఋణమును దీర్చుకొనివత్తును.

(అని పోవుచుండును)

రే—(వారించి) నాయనా! పోనిమ్ము. ఆదుర్మార్గుని జంపిన నీతండ్రిమఱల మనవద్దకువచ్చునా? అధర్మ మువానికే చెందనిమ్ము. నిన్నువిడచి నేనిచ్చటనొక క్షణమైన నుండఁజాలను.

జర—అమ్మా! నీవిప్పుడు నన్ను వారింపకుము. ఆనీచునిఁ జంపినఁగాని నామనస్తాపము చల్లారదు-కొంచెములో వచ్చెద. క్షమించి నన్నువిడచిపెట్టుము.

(అని విడలించుకొని పోవును)

రే—(విచారముతో) హా! దైవమా!

గీ॥ వనములను గాయకసరులు కొనుచు దినుచు,
జపముననునిల్చుమాలోటి సాధువులకు,
ఇట్టియిక్కటులనుగల్ప నేమియగును,
తగునటే దేవ, నీకిదిధర్మమగునె.

కుమారా! పితృఋణమును దీర్చుకొననెంచిననీకు జయమగుఁగాక!

(నిష్క్రమింతును)

యవనిక జారును.



తృతీయాంకము—ప్రథమరంగము

స్థలము—శయనమందిరము

(ప్రవేశము—కార్తవీర్యార్జునుని భార్య మనోరమ)

మనో—(తనలో) ఈశ్వరా! ఎన్నఁడులేనిది నేఁటికి నాకీ గతిఁదెచ్చితి వేమిటి?

సీ॥ పరకాంతలను మాతృ భావంబునన్ జూచు
పరమపావన ప్రభాకరసముండు,
దీనాళిరోదన మానసంబున నెంచి
కాచిరక్షించెడు కరుణమూర్తి,
భాగవతులఁ గన్నఁ బరమాదరముఁ జే
యక నుండనట్టి భక్తావనుండు,
లోకకంటకుల దుర్యోగంబులన్ జూడ
జాలని సాత్త్వికా చరణయుతుఁడు,

గీ॥ మునిజనానేకదివ్య సమ్మోదకరుఁడు,
కటకటా! నేఁటికొక కోపకలన నింక,
బరశురామునిఘోర దుర్వారమైన,
కోపవహ్నికిఁ జిక్కఁగా నోపియుండె.

అయ్యో! ఎట్టిగతి సంభవింపఁగానుండెను. దైవమా! మాకిట్టిపాటొనరించుటకు మేముచేసిన దోష మేమిటి? ఈవేట నాప్రాణేశ్వరుని యసువులుదీయుటకే వచ్చినదా అయ్యో! ప్రాణేశ్వరా! నిష్కారణముగా నాభృగురాముని కోపాగ్నికి మీరాహుతి కావలసి వచ్చునేమో!

ఏమి చేయుదును! వేటకు వెళ్లినవారు జమదగ్నిమహాఋషి యాశ్రమమున కేలఁబోయితిరి? పోయినవారామహాత్ముని యాతిథ్యము నంగీకరించి తిరిగిరాక ఆకామధేనువుపై నాశ నేల నిలిచితిరి? నిలిచిన వారా మహాత్ముఁడది ఈయనని నిమ్మర్గగాఁ జెప్పినప్పు డదిమాని తిరిగి యిటురాక ఆజమదగ్ని నిజంపి యాధేనువుని తీసుకొనిరా నేల? ఇపుడా తని కుమారుఁడగు పరశురాముని కోపాగ్నికి భస్మభూతము గానేల? అక్కటా! అతఁడు మహేశ్వరునిచే వరం బులంది యుక్కుమిగిలి యుండెనుకద! ఇంకనాభర్తకు ఆతనిబారినుండి కాపాడువారెవ్వరు? అయ్యో! కాలమా! నీమహాత్మ్యము ఎవ్వరు కనుగొనఁగలరు?

సీ॥ ఘనహరిశ్చంద్రునిఁ గాటికాపరివాని
 సేవకు గానుండఁ జేసినావు,
నళసార్వభౌము వనాటులలోఁద్రిప్పి
 పాకశాలనునుండఁ బంపినావు,
వగపురూపుఁ జేద వానిగానొనరించి
 గొల్లసేవకునిగాఁ గూర్చినావు,
అమరనాయకుని సింహాసనంబును బాపి
 కుష్ఠరోగిగనుండఁ గొలిపినావు,

గీ॥ కలిమిలేమిగ లేమిని కలిమిగాను,
మారుసట్టుల, ప్రభువునమాలగాను,
మాలవానిని ప్రభువుగా మార్చుచుందు;
వహావహా! నీచేతలకు నంతమనుటకలదె.

లేకున్న మాకీదీనత్వము నేటికిఁగల్పించెదవా? ఇప్పుడేమి చేయుదు?

సీ॥ వలదుపోవలదని వారింపవినకఁ దా
మృగయా వినోదినై యేగనేల,
ఏగఁబో వనిలోన నీశ్వరుమహిమఁ దాఁ
బెనుగాలితాకుఁడుఁ గనెనదేల,
గనెబో యాశ్రమ కామధేనువునకై,
కేరితాపసముఖ్యుఁ గోరనేల,
గోరఁబో యిచ్చుటకును వీలులేదన
జలమూని నతనిని జంపనేల,
గీ॥ జంపెఁబో పరశురాముండు సరభసముగ,
ప్రాణనాథునిగూల్ప దుర్వారమైన,
ప్రజ్ఞబూనంగనేల? నేపగిదినింక,
బ్రతికెదనుదైవమా! యెట్టిపాపినొకద.

అయ్యో! ఇంక నేనెంత విచారించినను నిసుమంత యును లాభములేదు కద!

గీ॥ బ్రహ్మవ్రాసినవ్రాతను బాయవగునె,
యనెడుసార్థకపూజ్య వాక్యంబునరసి,
నాదుగతియెట్టులుండిన నటులననుభ,
వించెదనుగాని; యిట్లుచింతించనేల.

కర్మమునకెవ్వరుకర్తలు కాగలరు? (అని కొంచె మాగి) ఏమిది? ఎంతధైర్యమూనిన నించుకంతయైన

హృదయము కుదుటఁబడకున్నది కదా? దైవమా! ఈ పాపిని ప్రాణముల నేలఁ గల్పించితివి? కల్పించినవాడవు నేటికీగతి నేలవెచ్చితివి? అక్కటా! ఇప్పుడు నా మొఱ నాలకించు వారెవ్వరును లేరుకదా! (అని మీదికిఁజూచి చేతులుజోడించుకొని) ఓదయామయీ! రాజరాజేశ్వరీ పతివ్రతలకు భర్తలతోడిదే లోకమగుట నాపతినెడఁజేసి భరింపరాని దుఃఖానలమునఁ బడఁద్రోయకుము, నీకిదే వేయినమస్కారము లాచరించుచున్నాను. ఎట్లయినను నానాధుని పరశురాముని బారినుండి యుద్ధరించి నాకు పతిభిక్షఁబెట్టుము-(అని కొంచెమాఁగి) అయినను నాభర్తనుగూడఁ గొంతవరకుఁ బతిమాలి యాపరశురాముని శరణుజొరునట్లు చేసిచూచెదనుగాక!

(అని నిష్క్రమించును)

(యవనిక జారును)

## తృతీయాంకము—ద్వితీయరంగము

### స్థలము—అంతఃపురము

(ప్రవేశము కార్తవీర్యార్జున చంద్రగుప్తులు)

కార్త—మంత్రీ! సైన్యములన్నింటిని యుద్ధమునకు సిద్ధముఁజేసి యుంచితివి కదా?

చం—చిత్తము-దేవరయాజ్ఞానుసారము నన్నియు సిద్ధముగనే యున్నవి.

కా—సరియే. మహేశ్వరుకరుణాకటాక్ష మెంతవరకా పరశురామునికి జయముఁగల్పించునో నేనును చూచెదను గాక!

చం—(చేతులు జోడించుకొని) ప్రభువులనుగ్రహించినచో సేవకుని విజ్ఞాపన మొకటికలదు.

కా—మంత్రీ! అది యేదియో తెలియఁజేయుము.

చం—దేవా! వేరేమియును లేదు-ఈయుద్ధము నన్యాయముగ మనము తెచ్చిపెట్టుకొన్నందులకు విచారించుచున్నాను.

కా—(కోపముతో) అన్యాయమేమి?

చం—క్షమించుఁడు. అతిథ్యమిచ్చినందులకై యాశ్రమ కామధేనువునుగోరి యద్దాని నీయనందులకై మహాత్ముఁడగు జామదగ్నిని జంపివేసితిమికదా!

కా—ఇదియా, మంచిమాటఁజెప్పితివి! అది వారియాశ్రమమనక మదీయ భుజరక్షణ సమాదరణముననున్న భూస్థలమని చెప్పుము. నేనుగ్రహించితిని-ఇందు తప్పేమున్నది?

చం—దేవా! కామధేనువును దీసికొనుట యొకతప్పని కాదు నాయభిప్రాయము-భయభక్తులతో నాతిథ్యమిచ్చిన యొకమహాఋషిని నిష్కారణముగఁ జంపి వేసితిమికదాయని విచారించుచుంటిని.

కా—ఓయీ! నిష్కారణ మనుచుంటివేమి. కారణము

లేదా? నేకోరిన ధేనువును నీయనని పంతగించుట యొక కారణము కాదా?

చం—అవును అయినను అందువారి తప్పేమున్నది? ఆశ్రమవాసయోగ్యమై నాకలోక సంచారియగు కామధేనువు నతనిని తమరుకోరుట ధర్మముగ లేదు.

కా—(కోపముతో) ఓయీ! ధర్మాధర్మములు నాకుమాత్రముఁ దెలియనివికావు. నాచేసంరక్షింపఁ బడుచు న్న మహీతలమున నున్నవస్తు వెచ్చటిదైననేమి? దానిని చేకొనుటకు నేనర్హుఁడనుగానా? అది ఈయమని అడ్డుబెట్టువారు నాకువిరోధస్తులు కారా?

చం—చిత్తము-అదినత్యమే-అయినను అదితమకిచ్చుటకు భూలోకనివాస యోగ్యమైనది కాదే! ఆమహాత్ముని తపఃప్రభావమున నదివారికి కావలసివచ్చినప్పుడు భూమిపై నవతరించి మరల యథాప్రకారము దేవలోకమునకుఁబోవును? తమకిచ్చుటకది ఎవరిసొత్తు?

కా—(కోపముతో) నీకిన్నిప్రశ్న లెవరడుగుమని చెప్పిరి? ఆధేనువునాచే సంరక్షింపఁబడుచున్న యాశ్రమములో నుండుటచే అది యెవరిదైనను నాదిగానే భావించి తీసికొంటిని-ఇందుఁదప్పేమియును లేదు.

చం—చిత్తము-సంతోషమే-అట్లయినఁ బ్రస్తుతకార్యమేరింగింపవలెను.

కా—కార్యమున కేమున్నది! మహేశ్వరు వరప్రసాదమున మిన్నుమన్నుఁగనక నన్నుఁజంపెదనని ప్రతిజ్ఞఁబూ

నిన యీపరశురామునిరాకయే యింకనాలస్యము
న్నది. అతఁడువచ్చినచో యుద్ధమే కార్యము.

చం—సరియే. నేనింక నాపనియందుండ లోనికిఁబోయె
దను.

కా—మంచిది. పొమ్ము

చం—నమస్కారము -(అని నిష్క్రమించును)

(అంత మనోరమ ప్రవేశించి)

మనో—(భర్తవద్ద విచారముతో నిలుచుండును)

కా—(ముఁగురులు సవరించుచు ఆశ్చర్యముతో) ప్రాణే
శ్వరీ! నేఁడునీవిట్లు విచారమున మునిఁగియుండుటకు
కారణమేమి?

మ—ఏమియును లేదు-(అని యూరకుండును)

కా—ఏమ యూరకుంటివి ప్రాణేశ్వరీ? విశేషించి ఏమైన
జరిగియుండెనా యేమి? లేకున్నచో

గీ॥ రాజ్యచక్రంబు శత్రుదుర్వారమైన,
బాహుబలమును విదళించి పాలనంబు,
జేయు కార్తవీర్యార్జును జెట్టఁబట్టి,
నీకుచింతింప నేమయ్యె నేఁడు చెపుము.

మ—ప్రాణేశ్వరా! వేరేమియును లేదు-నిష్కారణముగ
నొక తపోధనునిఁ జంపివేయుటయేగాక; పైపెచ్చు
తమప్రాణములపై కీడ్పా? తని కుమారునితో యుద్ధ
మాఁ దెచ్చుకొనుచుంటిరి కదాయని విచారించు
చుంటిని.

కా—(నవ్వుచు) చెలీ! ఇదియా నీవిచారణమునకుఁ గార
ణము! నన్నుఁ జంపుటకుఁ బరశురాముఁడే కాఁడు, వేయి
మంది పరశురాములైనను నేమియును చేయఁజాలరని
నమ్ముము.

మ—సరిగా; కానచ్చునుగాని, నిష్కారణముగ బ్రహ్మ
హత్యఁ జేసితులారఁ దమ్మునొని యంటిరికదా!

కా—చెలీ! బ్రాహ్మణుఁడు శత్రువైనప్పుడు రాజులకు
వానిని దండించన బ్రహ్మహత్యయా? ఇవి ఎచ్చటి
మాటలు?

మ—నాథా! మీరెన్ని చెప్పినను అవి నామనసున కెక్క వు-
గాని; జరిగినదానికై పశ్చాత్తాపము నొందుడు,
ఇప్పటికైనను ఆపరశురామునితో విరోధముఁ జాలిం
చిన మేలగును అతనిపేరెత్తినచో నాకొకవిధమైన
భయము కలుగుచున్నది.

కా—(నవ్వుచు) అబలవగుటచే నట్లనుచుంటివిగాని
త్రిలోకభీకరుఁడగు కార్తవీర్యార్జునకెందును భయ
ములేదని నమ్ముము.

(అంతఁ దెరలో)

ఓరీ రాజకులాధమా! కార్తవీర్యార్జునా!

సీ॥ ముదుసలుండగు జమదగ్నిఁ గదనమునను,
జంపుటలుకాదు; పౌరుషస్వాంతమున్న,
నన్ను నెదిరింపఁగ రమ్ము క్రన్ననిపుడె,
యనుపురముఁజూడఁ బంపెద నధమ నిన్ను.

కా—(విని అసహనముతో లేచి కోపముతో) ఛీ! వీరా వాపలుకులు? ఆ పరశురాముని గర్వమేటులు విస్తరించు చున్నదో? నీ వింక నంత దూరమునకు బోవద్దు. ఒక్క త్రుటిలో వానిగర్వ మడంచి వచ్చెదను. (అని వెళ్లఁబోవును)

మనో—(భర్త కడ్డమువచ్చి) మన స్వామి లవతల అనేకములున్నవి-గావున, మీరిపుడు వెళ్లవద్దు

కా—(కోపముతో) నీవిప్పుడేమియును మాట్లాడక నవతలకుఁబొమ్ము-నేనువెళ్లివచ్చెదను. (అని నిష్క్రమించును)

మనో—(విచారముతో) దైవమా! నేఁటికిట్లు చేయుట ధర్మముగానున్నదా? తప్పంతయును ప్రాణేశ్వరునదే యైనను, నామర్యాదయ ధర్మముననుసరించి, నాభర్తకెట్టి యాయాసమునుఁ గలుగకుండఁ గాపాడుము. ఇదే వేయి నమస్కారములు.

అని నిష్క్రమించును





# చతుర్థాంకము—ప్రథమరంగము.

స్థలము—హిమాలయపర్వతము
ప్రవేశము—పరశురాముడు

పర—(విచారముతో) ఔరా! కాలమహిమ!

మ॥ రణరంగంబున నోటువోయితి నుదాత్తత్వంబుతోఁ
గోరి; యా! జననాథుండ గటార్చుతెట్టులఁ బ్రతిజ్ఞా
దీక్షఁ దీర్చెట్టి? మ! జనకున్ బ్రీతినొనర్చు టెట్లు? పర
మేశానుగ్రహంబెల్ల నా కనుగుణ్యంబగు; నేమిసే
యుదును నాకర్మంబు యిట్లుండగన్!

త్రినేత్రుని వరప్రసాదమును గాంచి, యాకార్త
వీర్యార్జునహంతకుని మదీయ క్రోధానలము చల్లారినట్లు
శత్రుభయంకరమగు, ఈ ఖండపరశువుచే కలద్రెళ్ళ నేసి,
మహామూర్ధుని రక్తజలము మదీయజనకునికి తర్పణము సేయ
పంపిస్థుఁడనై ఇప్పటికి ఇరువదిసార్లు యుద్ధరంగమున నిల్చి
తిరిగాని, యొక్కసారియైన నాకోరిక నెరవేరినది కాదు
కదా! లోకాతీతుఁడనగు పరమేశ్వరుని కరుణాకటాక్షము
న సంప్రాప్తము నొందఁబడిన వరములఁగలవాడనై దగిం
త రీతి విశ్రాంతి లేముగ నా కార్యసాధనము నెరవేర్చు
కొనను చుంచుకొన నా కామూర్ధుఁడణుమాత్రమైన లక్ష్య
పెట్టకుండెనే? ఎంత యాశ్చర్యకరము! మహాత్ముఁడగు
ఈశ్వరుని వరప్రసాదముకన్న, నా హాతకుని బాహుపరా

గంపింపజేయుచుందువు గదా! త్రిలోకాధినాథా! ఇందెం
తయు సత్యము లేదు-దుర్వార సంగ్రామంబున మృత్యు
ముఖమునను బడియుండినను, దారుణాగ్నిని భస్మీభూతము
గా నుండినను, నేనింతగా జింతింపను గాని; లోకారా
ధ్యుడవగు నీవరప్రసాదమునం గాక నా యపజయములు
శాశ్వతముగ కరిమింపై, ప్రళయకాలమేఘ ఘుంఝూ
ంబులై, భయంకరమార్గ లిపానములై హృ
దయా త్రుటింబున వేధించుచున్నవి. త్రిలోకాధి పత్య
ముపోయినను నిరాకరింతునా, సమస్త బంధుమిత్ర పరి
వారము వీడినను సంతశోకపను, గాని; జగద్రక్షకా!
ముల్లోకాధిపతివై, సమస్త విశ్వమును నీను దృష్టులయం
దుంచిల్పి, జీవరాసులన్నింటిని నాటకపాత్రలవలె నభిన
యింపజేసి తుదిని యీజాండమంతయు ఒపాలికంబగు సం
హారమున ముంచి వేడుకగొనువాడవై, మరల వెలుగొందు
నీకరుణచే నీ యామూర్ఖుని మృత్యుకరాళమునకుఁ బంప
కున్నచో ఇంగా జింతించుచుంటిని! దేవా! జగన్నియా
మకుడవగు నీ యీర్ష్య మేమి యున్నదా? ఎన్నిసారులా హ
తికులతో యుద్ధముఁ గావించి పరాజితుఁడ నగుచుందుట?
లోనాకె సిగ్గువచుచున్నది! పరశురాముఁడు నేఁటికి నీ.
నా సేవ కలిపినను నిట్టి దుర్భర దుఃఖానలమునఁ గ్రాగు
చుండి, దైవమవై, తండ్రివై, గురుడవై, నాశోకము
నుపశమింపఁ జేయలేవా"

గీ॥ శంభువరమానఁ గారవస్వాంతుఁడగుచు
గార్తవీర్యార్జునుని గెల్వఁ గదనమునను,
నిలిచి భృగురాముఁ డిదేనంచెలమిఁ నన్ను,
కేలిసేసిననీకు సత్కీర్తియగునె?

ఈశ్వరా! ఈయపజయమునకు నీవును జింతింప వలసినదే। ఎందుకన? నీవు ప్రసాదమున్నదని భావించియే నేనింత సాహసంబున నిలచితిని! అట్టినాయీ భంగపాటు నీకుమాత్రము గాకుండునా?

గీ॥ రక్షకుండైన పార్వతీ ప్రాణశివుని,
వరములన్నియుఁ బొల్లుగాఁ బరగెనేఁడు,
దైవమాహాత్మ్య మీరీతి దైననింక,
ఎవరుదిక్కని నినునింక నెలమిఁగొల్తు

దేవా! అవమానసంద్రమునఁ మునిగియున్న దీనుఁడను, అందులోఁ బాదసేవకుఁడను. ఎట్టి ఇన్ని సంకట దవాగ్ని దహింపకుండ, నీ కృపాబుణాన్ని దీర్చు ఆనీచునాచేఁ గూలఁజేయుము. నీకన్న నాకన్యరును వేరు దిక్కులేమిఁ పదిపదిగ నిన్నిట్లు ప్రార్థించుకొనుచుంటిని.

గీ॥ వేయుమాటలేల? నింక నేవిధమ్మైన,
కార్తవీర్యార్జునునిఁ ద్రుంపఁ గలుగునట్లు,
నన్నుఁగృపఁజూడకున్న నీవున్నకడకు,
ఏనెచనుదంతు సమ్మన హోమహోమ"

కావున, ఎటులనన్నుఁ గాపాడినను నీదిగో భారము.- ఇంక నేను జపంబునం గూరుచుండెదను.-(అని కనులు

మూసికొని జపము చేసికొనుచుండు నంతలో)

(ఈశ్వరుని ప్రవేశము)

గీ॥ ఇతఁడు నాకారణంబున నింతదుఃఖ,
హృదయమునఁ దల్చి తపము నేవిధమునైన,
కార్తవీర్యుని గెల్వఁగాఁ గాంక్షఁ బూని,
చేయుచున్నవాఁడు ఫలసిద్ధిఁ జేయవలెను.

ఇంతవఱకును నాకార్తవీర్యుని కామహాశక్తి యగు రాజరాజేశ్వరి ప్రత్యక్షమై నిలచుటచే ఈ పరశురామునికి నేనిచ్చిన వరములన్నియుఁ బొల్లుకావచ్చుచున్నవి. ఎట్లయిన నామాటని తలక్రిందులుగా చేయక తప్పదు. కావున నాకార్తవీర్యుని కవచకుండలంబుల వంచించికొని పోవునట్లు బ్రహ్మను అతనివద్దకుఁ బంపించెదనుగాక!

(అని బ్రహ్మను దేశించి)

గీ॥ జీవకోటిని సృష్టించు చేవఁగొనుచు,
విష్ణునాభిని జనించి వెలుఁగుచున్న,
భారతీనాథ! యొకసారి పార్వతీశుఁ,
జూడరాగ సంతోషచూడ్కు లలర!

(అంత బ్రహ్మ ప్రవేశించి)

బ్ర—(చేతులు జోడించుకొని)

గీ॥ సర్వధికజ్ఞాన సంపూర్ణస్వాంతులైన,
లోకమూర్తులు, నిజధర్మ లోకమునకు,

కల్పమూర్తులు, తమరిట్లు కాంక్షఁ జేసి,
నన్నుదలంచెడు కత మేమి మన్ననలర?

ఈ—(సంతోషముతో) ఓ భారతీనాయకా! వేరేమియును లేదు-నీవిప్పుడు కార్తవీర్యార్జుని వద్దకు బ్రాహ్మణ వేషమునఁబోయి, యతని కవచకుండలముల నెట్లయిని యాచించి తీసికొని పోవలయును. ఇదియే నాకోరిక

బ్ర— దేవా! ఆదిమధ్యాంతరహితుఁడగు నీవు కార్యము నకుఁ గడగుదువని చెప్పుటచే నేఁడిప్పుడన్నిచింతింతును గాని. దేవరకా కవచకుండలములతో నేమిప్రయోజనమున్నది?

ఈ—(వేలితోఁ బరశురాముని చూపించుచు) ఓయీ, చూచితివా యీపరశురాముని? ఇతఁడు విష్ణ్వంశ సంభూతుఁడు-నాప్రియశిష్యుఁడు-ఇతనికాతఁడొనరించిన యపకారమునకుఁ గాను ప్రతీకారముఁ జేసి తీర్చవలసి యుండుఁగా నేను. కావున, నతని ప్రాణసంరక్షణ కరములగు నకవచకుండలముల నీవు పరిగ్రహించవలెను-లేకున్నచో, నతనిఁ గెలుచుట దుర్లభము.

బ్ర—అట్లయిన నిప్పుడేపోయి తమ కార్యము సానుకూలముగఁ జేసికొని వచ్చెదను-సెలవు. (అని నిష్క్రమించును)

ఈ—(పరశురామునితో జేయెత్తి చెప్పుచు) వత్సా! పరశురామా!

పర—(కన్నులెత్తి ఈశ్వరుని జూచి భయసంభ్రమములతో చేతులు జోడించుకొని)

గీ॥ హే జగన్నాథ, విశ్వేశ, హేమహేశ!
భక్తజన ప్రాంగణాంగ విహారి జాత!
నిన్ను నుతియింపఁగలనె ఇంతేని దేవ,
పార్వతీనాథ! ఇదే నీకు వందనంబు.

(అని సాగిలబడి నమస్కరించును.)

ఈ—(సంతోషముతో లేవనెత్తి) వత్సా! నేఁటికి నీవు కృతకృత్యుఁడవయ్యెదవు కార్తవీర్యార్జుని కవచకుండలంబుల హరియింప బ్రహ్మను అతనివద్దకుఁబంపించితిని. కావున నీవీసారి యతనినిదప్పక నోడింపఁగలవు.

పర —దేవా! అవమానాగ్నిచే భస్మీభూతమునగుచున్న నా దేహమునకు మరింత ఆహుతిగా యీసారికూడ అపజయము కలుగదు కదా?

ఈ—(నవ్వుచు) వత్సా! నీకు భయములేదు - తప్పక విజయలక్ష్మినొందగలవు. పొమ్ము నేనింక వెళ్లెదను.

పర—(సంతోషముతో) మహాత్మా! నమస్కారము!

ఈ—మంచిది (అని నిష్క్రమింపఁ బరశురాముడు కూడ వేరొక తట్టునుండి నిష్క్రమించును.)

(యవనిక జారును)

స్థలము _ కార్తవీర్యార్జుని సమాలోచన మందిరము.

(చంద్రగుప్తుఁడు కార్తవీర్యార్జునుఁడు ప్రవేశము)

చం—దేవా! మరలఁబరశురాముఁడు మనలగెల్వ నుద్దేశముతో, హిమాలయ ప్రాంతమునకేఁదపంబు సేయఁబోయెనట!

కార్త—అవును- అటులనే నేనువింటిని గాని; అతనికంతవైరెందులకు జనించెనో తెలియకున్నది?

చం—(నవ్వుచు) అందుకు ప్రభువే కారణము. దేవా వారతని జనకుని జంపుటచేఁబ్రతిక్రియాసక్తుఁ యతఁడట్టిసాహసమునకు లోనగుచుండెను-

కార్త—(కోపముతో) ఏమీ! అంతసాహసమునకు లోనయ్యెనా? అట్లయిన నతఁడు మరియొకసారి యుద్ధమునకు వచ్చునప్పుడతనిని తప్పక తుదముట్టించెదను- దానితో నాసాహస మడుగంటఁగలదు-

చం—చిత్తము. అతఁడును ఈతడవ జాగరూకుఁడయే వచ్చునను కొనియెదను-

కా—ఓయీ, నీమాటలనుఁబట్టిచూడ ప్రభువునగు నాయందు నీకు వేరు భావ ముదయించినట్లు తోఁచుచున్నది. పరశురాముడు నీకు స్నేహితుడాయేమి?

చం—దేవర వారేమనినను అనవచ్చునుగాని; ఈవిషయ
మున మాత్రము శ్రీవారికే చెప్పనిచెప్పగలను-

రా—సరియే. ఆవిషయము మనము నిర్ధారణ చేసికొన
వచ్చును గాని; ప్రస్తుతమతని సంగతి సందర్భములను
గోంచెము కనిపెట్టుచుండవలెను-

చం—అది శ్రీవారి పాదసేవకుని పనిగావున ఆవిషయ
మై, తమరు వహింపనవసరము లేదు. ఇంతకుముందే
యచ్చోటికి గూఢచారులనంపితిని.

రా—సంతోషమే, (అని కొంచెమాగి తెల్లఁబోవుచు)
మంత్రీ! నేటికిరువదిసార్లు పరశురామునితోఁ బోరున
వృదు లేనిది; ఈతడవతఁడు యుద్ధమునకు వచ్చునని
తట్టినప్పుడెల్ల ఒకవిధమగుభీతి జనించుచున్న దేమి?

చం—దేవా! ప్రభువులు కటాక్షించినచో సేవకుఁడొకటి
విన్నవింపగలడు

రా—అదియేదియో తప్పక తెలియఁజేయుము.

చం—వేరేమియును లేదు. ఇప్పుడు మనమా భృగు
రాముని ఆశ్రమమునకుఁబోయి యతనితో సఖ్యముఁ
జేసుకొనుటయే యుక్తమని తోఁచుచున్నది. పైని
శ్రీవారి చిత్తము.

రా—(కొంచెమాలోచించి) మంత్రీ! నీవు చెప్పినది ప్రస్తు
తస్థితి కనుగుణముగనేయున్నది గాని;, అట్లు చేసిన
చో లోకమెంత నవ్వును?

గీ॥ సమరతలమున శాత్రవసమితి గెల్చు।
కార్తవీర్యార్జునుని బాహుగౌరవంబు।
పరశురాముని చేఁజిక్కి పరులచేఁ।
బడఁగనని లోకులాడంగ నౌనుగాదె॥

ఇంతకన్న మనకు కావలసిన అపయశమింకొకటేమి కలదు? సమస్త భూమండలమును ఏకచక్రముగా నేలుచు దిగంతకీర్తి విరాజితుండన్న, వైరి వీరులకు గుండెలు పగులఁజేయు బాహుబల సమన్వితుండనఁగు టయేనికాక నేటికిఁ బదిసారులు యుద్ధరంగమునఁ బరాజితుఁ గావించి, ఇరువదియొకటవ సారి తనిగెల్వలేక అతనిని కార్తవీర్యార్జునుఁడు శరణుదూరెనను నింద లోకంబున నుండకుండునా? అందుచే నతఁడు మఱల మనపైకి యుద్ధమునకు వచ్చినచో-

గీ॥ కార్తవీర్యార్జునుఁడో; లేక, క్షత్రియాన్వ।
యాబ్ధిబడబానలంబయి నట్టి పరశు
రాముఁడో! కూలఁగాని సంగ్రామసీమ।
మరల నిరువురు బ్రతుకుట వరలదుగద!

శం—సరియే; అప్పటిమాటిప్పుడెందులకు? గాని; ఈతడవ యుద్ధమున నాకును గొంతభయముగానే యున్నది. కావున సైన్యములను ఇంకను జేర్చుకొనఁబోయెదను.

కా— మంచిది పొమ్ము.

(చంద్రగుప్తుఁడు నిష్క్రమించును)

(అంత బహ్మ బ్రాహ్మణ వేషమున బ్రవేశించును)

బ్ర— గీ॥ బాహుబలమున నిజ వైరివారమునను।
తల్లడింపంగఁ జేయుచు ధరణి నేలు
కార్తవీర్యార్జున మహాత్మ్యాత్మజేంద్రు।
కీర్తి వెలుఁగొందుగాక! లక్ష్మసులందు॥

కా— (సంతోషముతో లేచి) బ్రాహ్మణోత్తమా! నమస్కారము. వచ్చి ఈ ఆసమునలంకరింపుఁడు (అని యొక ఆసనమును జూపును)

బ్రా— నారాయణ నారాయణ. (అని కూర్చుండును)

కా— మహాత్మా! తీమారు దరిశనమిచ్చుటకు గారణమేమి?

బ్రా— (చిరునవ్వునవ్వుచు)

గీ॥ సకలసుభము లైశ్వర్య సంతతులును।
జనులు నీపాలనంబున గనుచునుండ।
గొరతలేదైన నాకొక్క కోర్కెయుంట।
వచ్చితిని సన్నిధికి నేను ప్రస్తుతమున॥

కా— మహాత్మా! ఆకోర్కెయేదిమో తెలియజెప్పిన నిష్ఫ జేయుది సమకూర్చి పంపువాడను. గావున వచియింపవలెను.

బ్రా—(నవ్వుచు) రాజా! మాటలవలన నేమి కలుగును- చెప్పినపిదప కాదనువారెందరు లేరు-

కా—బ్రాహ్మణోత్తమా! తమరట్లు సెలవిచ్చిన నేనేమని చెప్పగలను?

గీ॥ పలికితప్పినవాడురు; పరిజలవాంఛ|
తంబుఁగనన్ట్రి వాఁడును ధరణియందు|
రాజమాత్రుండె? గౌరవరంగమందు|
బడడెయుటులైన ధారుణీశ్వర! తలంప|

బ్రా—అవును. ఆమాటసత్యమే! అయినను పలికినట్లుఁ జేయుట కష్టసాధ్యముకాదా? కొంచె మాలోచించు కొని మరియును జెప్పుము-

కా—మీము రెంతమాత్రమును పరిశోధింప వలసిన యవసరములేదు- ఆలోచించుకొనియే చెప్పుచుంటిని. అదియునుగాక;

గీ॥ మేనఁబ్రాణంబులుండ; నేదానికైనఁ|
గార్తవీర్యార్జునుఁడు పల్కి కాదనుటలు|
గల్గునే? ధారుణీశ్వర ఘూర్ణితలంబు|
నవ్వదే? న్యాయమౌనె?

బ్రా—అట్లయిన గోరుకొనవచ్చునా?

కా—(తనలో) ఏమిది! ఇతని మాటలఁబట్టి చూడ యాచించుకొనుటకు వచ్చిన బ్రాహ్మణుఁడు కాదల్లఁదో

చుచున్నది. ఇందేమయిన మోసము లేదుకద!

(అని ప్రకాశముగ) తప్పక గోరవచ్చును.

బ్రా—(నవ్వుచు) రాజేంద్రా! నాప్రశ్నకింత యాలస్యముగా జబాబిచ్చుటచే నాహృదయ మాందోళనము నందుచున్నది. నిశ్చయముగఁ జెప్పుము. అడిగిన యిదవ కాదనుట లేదుకదా?

రా—(తనలో) నేనను కొనుచున్నట్లుగనే యిందేదియో మోసమున్నది? లేకున్నచో ఈ బ్రాహ్మణుఁడిట్లు నొక్కి పదిపదిగ అడుగుచుండుటఁ గారణమేమి? (అని కొంచెమాలోచించి) సరియే. యేమైనకానిమ్ము, పలికి లేదనుటకన్న పాపము లేదుకదా? (ప్రకాశముగా) బ్రాహ్మణోత్తమా!

గీ॥ ధరణిగిరిరఁదిరిగినఁ దాలవెల్లఁ
దెగిపడినగాని నామాట దీర్చుకొనెద
అంతియేగాని, లేదనుసంతనీచ
మతినిగానంచు నెంచి సమ్మతిని దెలుపు

ఇప్పుడే మీఅభీష్టము దీర్చిపంపించువాడను.

బ్రా—అట్లయిన నాయాజ్ఞానుసారము నీకవచకుండలంబులను ఈయుత్తరక్షణముననే నాకీయవలెను.

రా—(తెల్లఁబోయి జూచుచుఁ గొంతవడికి) బ్రాహ్మణోత్తమా! తమరు వేదాధ్యయనసంపన్నులు గదా; క్షత్రి

యోచితంబులగు కవచకుండలంబులతోఁ దమకుబని యేమియున్నది?,

బ్రా—ఉన్నది. ఏదయిననేమి! ఇచ్చెదవా? లేక లేదు పొమ్మనియెదవా?

కా—మీరు నిజముగా బ్రాహ్మణులేనా? లేకనన్ను వంచింపవచ్చిన శత్రువర్గములోనివారా?

బ్రా—(కోపముతో) ఇన్నిప్రశ్నలతో నీకుప్రయోజనమేమున్నది? మొదటనే యివన్నియును నాలోచింపలేకఁ బోయితివా?

కా—(చిన్నబోవుచు) సరియే తీసుకొనివెళ్లుఁడు- (అనితన కవచకుండలంబుల నొసంగును)

బ్రా—(అందుకొని) రాజా! నా వచ్చినపని తీరినది కావున నేనింకపోయెదను. (అని నిష్క్రమించును)

కా—(విచారముతో మీదికిజూచి) హేజననీ! రాజేశ్వరీ! లోకమాతా! సమస్తమును నీవేయనినమ్ముకొనినీపాద చింతనచే లోకముల కజేయుడనై సంచరించుచున్న నేను నేఁటికి బ్రాహ్మణుని వలనఁగవచ కుండలంబులు బోగొట్టికొనగల్గితిని. తల్లీ! ఇంక నాభుజ పరాక్రమ మాపరశురాముని చేజిక్కపోవు దినములు సమీపించినవి కాఁబోలు!

(అంతఁదెరలో)

ఓరీ! కార్తవీర్యార్జునా!

గీ॥ ఇంతవరకును నామాట నెంచకుంటి।
నిన్ను గాపాడుచుంటిని మన్ననలను
నేడు భావంబునాపైని వీడియుంటి।
నిన్ను వదలుచు నాదారి నేను బోదు॥

కా— (భయముతో) హా! జననీ! లోకమాతా, నన్ను విడచి నీవేగెదవా? (అనిమూర్ఛిల్లును)

(అంత మనోరమ ప్రవేశము)

మ—(కార్తవీర్యార్జునుఁడు మూర్ఛిల్లెనని తెలిసికొనలేక చచ్చి పడియుండెనని తలంచి దుఃఖముతో) హా! ప్రాణేశ్వరా! రిపుకులకంఠీరవా!

గీ॥ పోయితివె నాథ నన్విడి? పోవనీకు।
మనసుపుట్టెనె యేలీలమనెదుదాన?
లోకమ్మె నీవు నీతోటి లోకమేను!
నిన్ను విడనాడి బ్రతుకఁగా నేర్తునెటుల॥

(అని మూర్ఛిల్లును)

కా—(తెలివిఁ దెచ్చుకొని ప్రక్కమనోరమను జూచి ఆశ్చర్యముతో) ఏమిది! దేవి నేను చచ్చిపడియుంటినని తలంచి కాబోలు నన్నుఁజూచి మూర్ఛఁబోయినది. (అని ఆమెకు తనచేరుమాలుతో విసరుచుండును.)

మ—(తెలివిఁదెచ్చుకొని తనభర్తనుజూచి ఆశ్చర్యముతో.

ప్రాణేశ్వరా! నేడు మీరిట్లు పడియుండుటకు గారణ మేమి?

కా—దేవీ! ఏమనిచెప్పుదును? నేటితో నాకును, అజగ న్మాన్యుఁడగు రాజరాజేశ్వరునకిని యొడబాటు కలిగినది. అందుచేఁ జింతించుచు అట్లుపడియుంటిని- గాని; వేరేమియును లేదు.

మ—నాథా! అట్లు జరుగుటకుఁ గారణముండవలదా?

కా—నా తెలివి తక్కువయే యందుకుఁ గారణము. ఇంత కును నాభాహుపరాక్రమ మడుగు కాలము సమీపిం చుటచేత నాకాబుద్ధిపుట్టినది.

మ—(విచారముతో) అమంగళ మడుగంటుఁగాక! ప్రాణే శ్వరా! ఏలనిట్లు అమంగళము లాడుచుంటిరి? శత్రువు లెవ్వరైనఁ గుట్రఁజేయుచుండిరా యేమి?

కా—దేవీ! వేరేమియును లేదు. ఎవఁడో యొక బ్రాహ్మణుం డువచ్చి నాకవచకుండలంబులను బట్టుకొని పోయెను. అందుచే నాభాహుపరాక్రమ మడుగంటు కాలము వచ్చినదని యంటిని;

మ—(భర్త చేతులురెండుఁ బట్టికొని) ప్రాణేశ్వరా! నేటి నుండి మనమిరువురము కాననమునకుఁ బోయి కంద మూలాదులచే బ్రతుక జరించెదముగాన; యుద్ధమిం

కవదలివేయుఁడు. ఆ మహాత్ముండగు పరశురాము
నితో సఖ్యముఁగొనుడు.

శా—(మనోరమను కౌగలించుకొని) దేవీ, భువనరక్షణ
కుఁదగిన బాహు పరాక్రమమునయందు నా జీవితేశ్వ
రివై యుండియు నిట్లు భీతిల్లుచుంటివేమి? లోకమందు
కు నవ్వదా? ఆ పరశురామునితో సఖ్యమనుమాట
కల్ల-అతఁడో నేనో యిటుపై నుండవలెనుగాని; ఇరు
వురు నిఁకపై నుండరని యనుకొనుము- పొమ్ము-

మ— (విచారముతో) నాథా! నామాటవినుఁడు- యెప్పు
డు మీకవచకుండలంబులు పోయెనో అప్పుడే మీ
పరాక్రమము గూడఁబోవునని జగన్మాతయగు రాజ
రాజేశ్వరి ఆజ్ఞయిచ్చినది- కావున యుద్ధమువిడిచి
తపోవనమునకుఁ బోవుదము రండు-

శా—(నవ్వుచు) దేవీ,

గీ॥ రాజులకు యుద్ధమే మోక్షరాజ్యమగుచు
వరలుచుంటను నటువంటి భక్తి విడచి।
వనములందున జరియింప భావ్యమగునె।
యెంచుమిలనాగ భీతిల్ల నేమియగును॥

కావుననీవింక అంతఃపురమునకుఁ పోయి జగన్మాత
యగు నారాజరాజేశ్వరిని ఆరాధించు చుండుము-
పై సంగతులఁ జూచుకొనెదము- పొమ్ము-

(అంత కెంతో క్రోధముతో)

ఓరీ క్షత్రియకుల బాడబమా! కార్తవీర్యార్జునా!

గీ॥ ఇంతవరకును నీశౌర్య మెంచియుంటి
నిపుడు నాశౌర్య మిసుమంత నెంచరమ్ము!
నాటి భృగురాముఁడీనాడు మేంటియయ్యె।
పౌరుషము నీకు గలదేని వచ్చినిఁక వు॥

కా—(విని కోపముతో) దేవీ, వింటివా పరశురాముని పలుకులు! నీవింక నంతఃపురమునకుఁ బొమ్ము. శత్రువుండట్లు పిలుచుచుండ నతనిని జేరఁబోవకుండుట కన్న నీచము మనక్షత్రియ ధర్మమున లేకుండుటచే నిప్పుడే పోయి యాముూర్ఖుని యమునదనమున కతిధిగాఁ జేసి కొనివత్తును- (అని లేవఁబోవును)

మ—(విచారముతో) ప్రాణేశ్వరా! —

కా—(అర్థోక్తియందే) దేవీ, నన్నడ్డవలదుఁ నేనిప్పుడే పోయి వచ్చెదను- (అని నిష్క్రమించును)

మ—(విచారముతో) చేతులు జోడించుకొనిఁ టూదికిఁజూచి) హేతల్లి, జగన్మాతా, రాజరాజేశ్వరీ,

గీ॥ ప్రాణవిభునకు నేకీడు రానియటుల ।
గాంచినమ్మఁబ్రోవు మా తల్లి కన్నసుతను •
దిక్కు-నీకన్ననింక నెందేనిగలదె!
రాజరాజేశ్వరివి లోకరమ్యమతివి!

అమ్మా! నీకన్న కుమార్తె నగుటచే నాకు పతిబిక్ష మాత్రము పెట్టుము- నీకిదే వేయి నమస్కారము లాచరించుచున్నాను- (అని నిష్క్రమించును తెరపడును)



# పంచమాంకము—ప్రథమరంగము

స్థలము—యుద్ధభూమి

పరశువు చేతఁబూని రౌద్రముతోఁ బరశురాముఁడు
ప్రవేశించును

పర—ఓరోరి కార్తవీర్యార్జున పాతకా! ఎందును గాన
రాకుంటివేమిరా?

గీ॥ ఇదియె నీ పౌరుషము మూర్ఖ! ఇంచుకంత,
నిలువకను తొలఁగఁగా నేని? పలుకులన్ని
పలికినాఁడవు; పలుకఁగాఁ బౌరుషంబె
వచ్చి నను తాకు నీకుండు పౌరుషమున॥

ఓరీ, నీచా, అతిథిసత్కార మొనర్చిన ముదుసలి జమదగ్నిని జంపుట కాదు- వీరుఁడవైన యొక్కసారి వచ్చి నన్ను దలపడుము- ఓరా! మూర్ఖా! ఎంత సాహసము జేసి జూపించితివి! రాజ్యమదాంధత్వమున గన్నుఁగానక నాజనకుని జంపి బ్రహ్మహత్యను సంపాదించితివి! పాపాత్మా! నీయట్టి నీచుఁడుండుట భూరమణికి సంతాపకరముగాన నెట్లయిన నీపరశువుచే నీతలఁ దెగవేయకఁగాని; నేనిచ్చటినుండి జనను!

గీ॥ రాజ్యమదమున జపతపో లక్ష్యనియతుఁ
డైన జమదగ్నిఁ జంపిన హీనమతివి।
నిన్నుఁ జంపినఁ బాపమింతేనిఁగలదె।
రమ్ము ద్రుంచెద వేగ సంగ్రామమందు॥

ఒరీ పాపీ! నీచావునకు పదునాలుగు భువనములును సంతోష మొందుననుటకు సందియ మింతమాత్ర మును లేదురా?

గీ॥ వనమునందునఁ గాయలఁ బండ్లుదినుచు
జపము సలిపెడు జమదగ్నిఁ జంపితీవు।
ఆమహాఘోరపాపమీ యాజినిన్నుఁ
దెల్లగాఁజేయు మూర్ఖ! యేలీలనైన।

ఎంతకాలమిట్లు కఁటఁబడకుండెదవో కొంచెము నేనును చూచెదనుగాక! భూమ్యాకాశములు తలక్రిం దైనను ఈశ్వరందత్తమై, నీబోటి నీచులకు ప్రళయ కాలసర్పమునై వెలుఁగొందు ఈభీకర పరశువుచే నీతల నేలపైఁ గూలజేయక మానను-

గీ॥ ఎందరెందరు నినుగావ నెంచియిపుడు
అడ్డపడువారొ చూచెదనంతెగాని;
నీచుఁడవునైన నినుఁజంప నేటికనుచు
దాలఁగువాఁడను కానింక ఖలుఁడ నేను॥

ఈహరి నిన్నేగాక, నీబోటి నీచులనెల్లరను యమ సదనమునకంపి భూరమణి సంతాప భారముదీర్ప కున్న

నా పేరు పరశురాముఁడు కాఁడనుకొనుము. నన్ను
జంపుట కెన్నిఁటినో సైన్యములను గ్రోగుఁ జేసితివెం
దులకు? నన్నా సైన్యములడ్డి నిన్ను గాపాడుననియా
యెంచుకొంటివి? ఓరీ, నీతుచ్ఛ సైనము లేకాదు.

గీ॥ ఇపుడు నా బారిఁ బడకుండ నెలమిఁ జేయ।
బ్రహ్మ విష్ణులు వచ్చి సంగ్రామమందు।
నన్ను నెదిరించుననుకూడ నిన్ను జంప।
కుండఁ బోదునని నమ్ముకుండుమింక॥

ఇంతటితో నీ యాయువు పర్యాయ మయ్యెనని యెంచి యొక్కసారి నాతోఁ బోర సాహసింపుము లేకున్న బో, ఓరీ, నీచా! లోకమంతయు నిన్నుఁ గూర్చి నవ్వునుసుమా! ప్రాణరక్షణముకై నియమించుకొనిన నీ సైన్యములన్నియు మైనవోకును అదేగితిపట్టను గాన, వీరపురుషోచిత చావును జచ్చుటకు నిలువుము

గీ॥ ఎంతదాగిన నిన్ను నేనెటులనైన।
బట్టి జంపుదుగాని, యేపగిదినైన।
వదలెదని ఆశవిడువుము పరమమూర్ఖ।
బ్రహ్మ హత్యను గావించు పాపివగుట!

(అంత తెరలో క్రోధముతో)

ఓరోరీ బ్రాహ్మణకుల చండాలా! పరశురామా!

గీ॥ నేఁటికిరువది సార్లు పోరాటమందు।
సిగ్గువిడనాడి జీవముల్ చెందుటకును।
పారిపోయెడు నీదగు పౌరుషంబు।
మరలఁ జూపింపవచ్చి యొందరిగితీవు!

పర—(విని భయంకరమగు కోపముఁ ... (దనలో) ఆమా
ట లాక్షత్రియకుల బాడమగు కార్తవీర్యార్జున హాత
కునివిగానే తోఁచుచున్నవి; ఎంతయాశ్చర్యకరము
నేనే యామూర్ఖుని బారికిజడిసి పారిపోయితివని
పైపెచ్చు ప్రేలుచుండెనే! (అని తెరవద్దకుఁ బోయి)
ఓరీ రాజచంఢాలా!

గీ॥ ఎటులనైనను నీప్రాణ మిపుడుఁగావగఁ।
గాచుకొనియుంటినే గాని ఖలుఁడ నేను।
నీకు భయపడి దాఁగఁగా నెంచలేదు।
రమ్ము ద్రుంచెద నిన్నుసంగ్రామమందు॥

(అంత ఖడ్గహస్తుఁడై కార్తవీర్యార్జునుఁడు ప్రవేశించి
పరశురామునిజూడకయే రౌద్రముతో)

కా —ఓరీ, బ్రాహ్మణకుల బడబానలమా! పరశురామా!

గీ॥ భావమందున నిసుమంత పౌరుషంబుఁ।
గలిగియుండిననిట్లు సంగ్రామమందు।
పగరకును వెన్నుఁ జూపంగ నగునె నీకు।
ఎందుదాగెదవో యింకయేనుజూతు।

(అని పరశురాముని జూచి రౌద్రముతోఁ బండ్లు పటపటఁ గొరుకుచు నెకసెక్కెముగా) ఓహో! ఈశ్వర వరప్రసాద లబ్ధతేజోవిరాజమానులగు పరశురాములు తమరే కాబోలు!

మహాత్మా! ఇపుడెంతేగెదరు?

గీ॥ పౌరుషము లేక పదిపది వచ్చినిన్ను!
ముక్కలు ముక్కలుగాఁ జేసి భూతములకు,
బంచిపెట్టినఁ బాపంబుఁ గాంచరాదు,
బ్రాహ్మణ కులాబ్ధిఁ బుట్టిన బాడబమవు!

ఇంక నీ బ్రతుకు ప్రయత్నము విడిచిపుచ్చి యుద్ధమొనరింప నిలువుము.

పర—(క్రోధముతోఁ గూడిన చిరునగవుతో) జారా! మూర్ఖ!

గీ॥ కాఖ్యముగఁ బల్కుటనీ శౌర్యలక్షణముఁ కు!
సంశసంబందుచును నుంటి స్వాంతమందు!
ఖలుడవగు నీనువల్కుల కార్యమే మొఁ
నిలచితినే జూపుమిప్పుడు చలముఁబూని!

మునుపలుఁడగు జమదగ్ని మహాఋషిని జంపి కామధేనువును గొన్నటులకాదు! భువనరక్షకుఁడును, రౌద్రరూపియగు మహేశ్వరు వరప్రసాదకలిత తేజోవిరాజితుఁడనగు నన్ను జయింప నెంచుట, ఓరీ, రాజాధమా!

గీ॥ అతిథివని సత్కరించిన యందుకటుల।
నాదుతండ్రిని గూల్చు చండాలుఁడవగు
నిన్నుద్ధ్రంపక విడినచో నన్నులోక।
మెంతనవ్వునో కనిపెట్టు మింకమీఁద॥

అట్టినేను నీబారికి జడిసి పారిపోవు వాఁడనా? రాజ వగుటచేనట్లు లౌఖ్యముగాఁ బ్రేలుచుంటివి గాని; నీప్రేలినయట్లు పారిపోవుటకే పరశురాముఁడు తగఁడని భావింపుము?

రా_అవును నీపౌరుష మెవరికి తెలియనిదికాదు!

గీ॥ సమరమందున నిరువదిసార్లు నిలిచి।
వెన్ను జూపించి పరుగెత్తు వీరమతివి,
నీకు మించిన మేటియెందేనిఁ గలఁడే?
చెప్పుకొనుటకు లేశంబు సిగ్గులేదె?॥

నీవు కాఁబట్టి ఇంకను బ్రతికియుంటివి గాని; ఇది యే నైనచో నాదినముననే పొడుచుకొని చచ్చిపోవుదును గాన; పలుపలుకులేల వినుము!

గీ॥ శౌర్యముండిన నాతోడ సమరమిపుడు।
చేయునిలు; కుల్లలేకున్న సిగ్గువిడచి।
బ్రతుక నెంచుముగాని; ప్రేలాపనముల।
బలుకకిటుపైని, పలికిన నిలనుగూల్తు॥

• పౌరుషమున్న రమ్ము-నీ మొగముఁ జూచుచు నిలుచున్న కొలఁది క్రోధముచే నాశరీరము నాకు స్వాధీనముఁ గాకుండఁ గంపమెత్తుచున్నది?

(అని కత్తిని మీఁదికి యెత్తును)

పర—(రౌద్రముతో బరశువు నెత్తి) ఓరీ, మూర్ఖా!

గీ॥ యుద్ధసన్నద్ధమతివై యుండకుండ।
నిలచినందుకు నిన్ దృంచ నెంచకుంటి।
నంతియేగాసి; నిన్ గూల్చ నెంతనాకు।
గాచు కొనుమింక ప్రాణమున్ దాచుకొనక॥

(అని వడుకఁబోవును)

కా—(భయముతోఁ బారిపోవును)

పర—(తెల్లఁబోయి, కోపముతో) ఓరీ, రాజాధమా! ఇది యా నీ పౌరుషము!

గీ॥ ఇట్టి శౌర్యంబుఁ జూపగా నెంచి నీవు।
వచ్చితివో మూర్ఖ! నీవల్కు పౌరుషంబు।
వెనుదిరిగి 'చూడ,బంపె నివ్విధము'దేమి"
ఎందుఁ బోయెద' వెందున్న నేను విడువ॥-

ఎట్లయిననిన్ను తుదముట్టించకగాని; ఈపరశు రాము డేగువాఁడు కాఁడని బాగుగా మదిలో భావింపుము-ఇదే వచ్చుచున్నాను.

(అని ముందుకు నడుచుచుండునంతలో,

మనోరమ ప్రవేశించి)

మ—(దీనముగఁ జేతులు జోడించుకొని) మహాత్మా!
పరశురామా!

గీ॥ ఆదిమధ్యాంతమూర్తివై; యవనిభార
మణుపజేఁన దెంచినట్టి శ్రీయాదివిష్ణు
వగుట నా ప్రార్థనముఁబూని పగనువిడచి
నాకు పతిభిక్ష బెట్టుమా జోకతోడ॥

(అని పాదములపై బడును)

పర—(ఆశ్చర్యముతో) అమ్మా మీ రెవ్వరు?

మ—తండ్రీ! నేను నీ గర్భశత్రువగు కార్తవీర్యార్జును
పట్టమహిషిని-నా పేరు మనోరమ!

పర—తల్లీ! క్షమింపుము! ప్రతిజ్ఞాపాలనమున నిలచు నేను
నీ మొరాలించలేను. కావలసిన నాయుత్తమాంగము
ఖండించి నీకిచ్చెదను గాని, నీకుమాత్రము పతిభిక్ష
బెట్టజాలను.

మ—(దీనముగ) తండ్రీ! ధర్మమూర్తివి! నా మొరా
లింపుము.

గీ॥ నిర్గుణుఁడ వీవు; సగుణ నిస్మితహృదయ
మందినంతనె కార్పణ్యమందెదే దగునె?
శత్రుమిత్ర విభేదంపు పరణినీకు,
గలదె నాతండ్రి! పతిభిక్షగారవింపు!

పర—(విస్మయముతో) అమ్మా! నన్ని విషయమున మన్నించి; నీవచ్చినత్రోవఁ బట్టుము!

గీ॥ పరశురాముండొ; లేక వెంపల గారొ!
వీర్యుఁడో నిల్చుగాని యీపృథ్విలోన।
నిరువురును నింకనిల్చుట జరుగదమ్మ!
జనుము నీవింక క్షమియించి సౌధమునకు॥

(అని నిష్క్రమించును)

మ—(విచారములో) హా! పరమేశ్వరీ! నాకింకేగతి! నా మొరాలించు వారెవ్వరు? పతియూ లక్ష్యపెట్టకుండెను పగతురుఁడా ఆమోదింపఁడయ్యె! ఏమిసేయుదున?

( తెరలో )

ఓరీ? మూర్ఖా! మరల యుద్ధమునకుఁ దలపడెదవా? రమ్ము రమ్ము

గీ॥ ఇపుడె నినుబట్టి లోకంబు లేపుఁగనఁగ।
ద్రుంచెదను నిక్కమీసారి నేగకొటకు।
పరశురాముఁడో లేక పెంపలరఁ గారొ!
వీర్యుఁడో నిల్చు నింకపై పృథ్విలోన!-

మ—(విని) అన్నా! మరల యుద్ధమునకు తలపడిరి కాఁబోలు! (అని వడివడిగ నిష్క్రమించును)

(యవనిక జారును)

## పంచమాంకము—ద్వితీయరంగము

స్థలము —యుద్ధరంగము.

ప్రవేశము—పరశురాముఁడు

ప—(రౌద్రముతో) నేఁటికి కార్తవీరార్జున హతకుని చావువలన భూదేవికి కొంచెమంతా భారము తీరినది! కావున, మిగిలిన నీచాధములగు రాజులనందరిని జంపి మదీయజనకునికిఁ బితృతర్పణముఁ జేసినఁగాని నామ స్తాపము చల్లారదు! (అని కొంచెమాగి) ఓహో! ఎంత కాలమునకు నామనోరథసిద్ధి కలిగినది! హే! పరమేశ్వరా! పార్వతీవల్లభా!

గీ॥ ఇన్నినాళ్లకు భవదీయకృపనుగార్త,
వీర్యునిన్ గూల్చినాడు హృద్వీథియందు,
కోపవహ్నిని నడఁగించు కొనుటకలిగె,
లోకరక్షక, జగదేక, లోకవినుత!

ఇంకను నీకరుణయున్నచో నేనీభూమండల మందున్న రాజాధములనందరిని యమసదనమునకు బంపించి, తద్రక్తధారలచే నాజనకునికి బితృతర్పణము గావించి తీరెదను! మహేశ్వరా! పాపభూయిష్ఠులై, సాధుజన హింసాపరులై, పరధనదారాపహారులై, నీచవృత్తిని మెలఁగుచున్న ఈరాజాధములవలన భూదేవి అధికమగు సంతాపము నందుచున్నది! కీటకసమానులగు ఈనృప

శ్రేణి ఖండింప ఆజ్ఞనొసంగుము! ఇప్పుడే ఈసకల భూమండలమును దుష్టనృపాలరాహిత్యముగా నొనరించి తీరెదను!

గీ॥ మనుజుఁడై పుట్టి జ్ఞాన సంపర్కమహిమ,
నందియున్నను లాభంబునందుఁగాని;
ఘోరసంసారదావాగ్ని గోరినటుల,
హీనుఁడగుఁగాదె ప్రకృతిచే నీడ్వఁబడిన?

దేవా! ఆదిమధ్యాంతరహితుఁడవును, అప్రమేయుఁడవును, పురాణపురుషుఁడవును, నీవెరుఁగని దేమున్న! దుష్టశిక్షణ, శిష్టరక్షణ పరిపాలంబునకై గడంగు నీవు నాకాజ్ఞనొసంగుము!

గీ॥ ఈమహా రాజలోకంబు ద్రుంచి మించి,
నాదు తండ్రికి పితృతర్పణంబుఁజేసి!
యవనిభారంబు రూపింతు నంచుఁగోరక!
దేవ, దయచేయుమీ యాజ్ఞ, దివ్యతేజ!

(అంత ఈశ్వరుఁడు ప్రవేశించును)

ప—(ఈశ్వరునిఁజూచి సంతోషముతోఁ జేతుల జోడించుకొని)

గీ॥ హేజగన్నాథ, విశ్వేశ! హేమహేశ!
లోకరక్షక, నిజభక్తలోకవరద

శాశ్వతానంద త్రిభువన సన్నుతాంగ!
పాహి శ్రీపార్వతీనాథ! పాహిపాహి!

(అని పాదములకు సాగిలఁబడి నమస్కరించును)

ఈ--(సంతోషముతోఁ బరశురాముని లేవనెత్తి) వత్సా! నీభక్తికి సంతసించితిని! నీయభీష్టము నెరవేర్చు కొమ్ము, నేనింకఁ బోయెదను.

ప - మహాత్మా, మహాప్రసాదము! రాజలోకము నీచ సంగతిని ఉక్కుమిగిలి భూదేవి కాయాసముఁ గల్పించుచున్నది! అందుచేఁ దమయాజ్ఞ ననుసరించి మేదిని నృపరాహిత్యమైనటులఁ జేసివచ్చెదను.

ఈ —సరియే. కృతకృత్యుఁడవయ్యెదవుగాక! నేనింకఁ బోయెదను.

ప— మహాప్రసాదము.

(అంత ఈశ్వరుఁడు నిష్క్రమించును)

ప (సంతోషముతో)

మ॥ తెలియించెన్ గద నాదుజన్మము మహోదారుండు మాహేశ్వరుం। డలయన్ నన్ గరుణించుటన్ జగము నుద్యద్బాహు సంరంభసం। గరకేళిన్ భయసంభ్రమంబుల వడంకన్ రాజలోకంబునన్। గరముత్సాహముతోడఁ ద్రుంచి జనకున్ సంతోషమున్ బెట్టెదన్॥

కావుననిప్పుడే బయలుదేరి తుచ్ఛులగు రాజకోటి సంహరించి తద్రక్తధారలచే నాజనకునికి బితృతర్పణంబుఁ గావించెదను!

(అంత అకృతవర్ణుడు ప్రవేశము)

అ—మహాత్మా, నమస్కారము!

ప—అకృతవర్ణా! విశేషములేమైన నున్నవా యేమి?

అ—వేరేమియును లేవు. యుద్ధఫలితమును జూచిరావలసినదని మాతల్లిగారు సెలవిచ్చిపంపుటచే వచ్చి జయలక్ష్మిని వెలుగుచున్నమిమ్ము సందర్శించి ధన్యుఁడనైతిని! కావున అమ్మగారివద్దకుఁ బోవుదమురండు.

ప—అట్లే వచ్చెదనుగాని; నాకార్యమింతటితో నింకను అంతముకాలేదు

అ—(ఆశ్చర్యముతో) ఇంకేమికలదు?

ప—ఓయీ, క్షుద్రులగు నీరాజులందరిని ఎరికిపైచి వారి రక్తధారలచే నాతండ్రికి తర్పణముఁగావించిగాని నా మనస్తాపము చల్లారదు! వీరలనుంచి భూమిమణి సంతాపముతో నిలచియున్నది! కావున ఆమెభార మిప్పుడు తీర్పవలెను.

అ—మహాత్మా! తప్పక అట్లేయగుఁగాక!

గీ॥ ధర్మమేవ జయంబను నిర్మలోక్తి,

ధర్మకర్మ స్వరూపులై తనరుచున్న,
జనుల కగుఁగాక జయము నిస్సంశయముగ॥

ప—(సంతోషముతో) శోభాస్తు! (అకృతవర్ణా! మన మిప్పుడాశ్రమమునకుఁబోయి ముద్దుతల్లిగారిని దర్శించుకొని సంకల్పసిద్ధులమయ్యెదము రమ్ము.

అ—మహాప్రసాదము.-(అని పరశురామునితో నిష్క్రమించును)

(యవనిక జారును)

నాంది

ఇది శ్రీసీతారామచంద్ర చరణారవింద సేవాసమాసాదిత,
సరససాహిత్య కవిత్వవైభవ, భరద్వాజసగోత్రో
త్భవి, వడగ వంశాంభోధి పవిత్రచంద్ర, లచ్చన
కనిష్ఠపుత్రి సూరమాంబాగర్భశుక్తి ముక్తా
ఫల కౌస్తుభ ప్రణీతంబైన ప్రతిజ్ఞా
పరశురామమను నాటకరాజంబున
పర్వంబును సమాప్తము

శ్రీసీతారామచంద్ర పరబ్రహ్మార్పణమస్తు.



వెలతులభము! అద్భుతమహిమ!! గుణమధికము!!!

# * సుఖరోగసంజీవిని *



మా “సుఖరోగసంజీవిని” యందుగల యద్భుత మహిమను సేవించినవారికి వేరుగాఁ జెప్పనవసరములేదు. అనేక యోగ్యతాపత్రములనందిన, రిజిష్టరుకానున్నది. (గనేరియా) నామాంతరముగల పచ్చశెగ-యెఱ్ఱశెగ-తెల్లశెగ వీటియందుమాత్రము యద్భుతశక్తిని చూపించి పనిచేయునని మాసుఖరోగసంజీవినీ విషయమై యెక్కువగా కొనియాడవలసినదే? ఇప్పుడే ఆర్డరులనుపంపుడు-గనేరియారోగమునకు విష్ణుచక్రమువంటిదని భావింపుడు-వేగముగా ఇతరులకు తెలియకుండా మీకుగల యీసంబంధ రోగములను, మాసుఖరోగసంజీవినీయను మహౌషధమును త్వరలో సేవించి, నిర్మూలము చేసికొని, సుఖమునసుభవింపుడు-మాసంజీవిని పనిచేయులేదని ఋజావు చేయువారికి తిరిగిసొమ్ము వాపసు చేయబడును-కావలసినవారలు నేటేదినమే ఆర్డరులనుబంపి, యీమహౌషధమును తెప్పించుకొనుడు. ఔషధము అనుపానసహితముగాఁ దెల్పఁబడును-5 దినములలో మీకుగలరోగము సంపూర్ణనాశనము కాగలదని మేము నొక్కివక్కాణించి చెప్పగలము. 5 దినములకుసరిపడు సీసా 1 కి రు. 4-8-0 మాత్రం వివరమును సోమవారు యీక్రింది యడ్రసు

నకు రిప్లయికార్డు వ్రాసినచో, వెంటనే జబాబు బడయ
గలరు. మంచిఁతరుణమని నమ్ముడు.

సమయము గోల్పోకుడు! ఉపయోగింపుడు!!

## రాజవిరోచనవటి

అత్యద్భుతమహిమగల మా రాజవిరోచనవట్టిని
వాడుకచేయువారు సునాయాసముగా, మలబద్ధసంబంధ
రోగములను కొద్దికాలములోనే బేధించుకొని సుఖసంపా
దనము పొందగలరు. ఇప్పటికి కొంతమంది పొందియు
న్నారు. ఇది రస విష సేపాళములు కలియకుండా కుంకు
మపూవు, కస్తూరి, వనమూలికలతో శుద్ధిచేయబడినది.
ఉచితముగా 3 మోతాదులువరకు యీయబడును.
మా 30 త్రలుగల సీసా 1 కి రు. 0-6-0 లు.

## రక్తగ్రహణిమాత్రలు

సోదరులారా! ఈలోకమందు "రక్త గ్రహణి"
యను రోగముచే జనులు చాలావరకు పీడింపఁబడుట
మనము మనకండ్ల ఎదుటనే చూచుచున్నాము గదా!
అట్టి రక్తగ్రహణియను రోగమునకు వజ్రాయుధము

వంటి దివ్యౌషధము మాచే తయారుచేయబడినది. 3 మోతాదులు యీరోగముగలవారు సేవించినచో రోగనివర్తులగుదురని బాగుగా చెప్పగలము-కొంత మంది మాచే తయారుచేయబడు యీయుత్కృష్టౌషధము ననుభవించి, ఇప్పుడు సుఖమనుభవించుచుండిరి.

ఉచితముగా 3 మోతాదులవరకు ఈయబడును.

మా 30 త్రలుగల సీసా 1 కి రు 0-8-0 లు.



## గుల్మకుటారిణి



ఆకలిచేతను మితముగా భుజించుటవలన గలిగిన అజీర్ణసంకటములు, పైత్యసంబంధ దుర్గుణములువలన గలిగిన బాధలను పోగొట్టుటకు గొడ్డలివంటిది. 5 నిమిషములలో రోగము నివర్తి చేయుగలదు. కడుపునొప్పుల యందు మాత్రము వజ్రాయుధముగా భావింపుడు-వెంటనే సేవింప త్వరపడుడు-ఇట్టిమందును విడిచిపెట్టి రోగములను గర్భకోశమందు దాచిపెట్టుకొనకుడు.

ఉచితముగా 3 మోతాదులవరకు ఇవ్వబడును.

మా 30 త్రలుగల సీసా 1 కి రు 0-8-0 లు.

వలయువారు, వడగ లక్ష్మన్న అండు సన్సు,
బొంతలకోడూరు, (Via) శ్రీకాకుళం.

# * మూర్తి కేతకీఖారామసాలా *

అయ్యా,

అనేకమంది అనేకవిధములగు పేర్లతో «కేతకీ ఖారామసాలాను" విక్రయించుచున్నారు. గాని; మా మూర్తి కేతకీఖారామసాలాను ఒక్కసారి వుపయోగించి చూచినచో ఆమసాలాకును మా «మూర్తి కేతకీఖారామసాలాకును" గలభేదము మహాత్ములకందరికిని తెలియగలదు. కాలానుగుణముగ అనేకములైన డాంబికపు ప్రకటనలు లోకమును వంచింపవచ్చును, గాన, అట్టి ప్రకటనలచూచి మోసపోవక ఒక్కసారి మా «మూర్తి కేత[illegible] ఖారామసాలాను" చిత్తగించి ఇందుగల నిజానిజములు పరీక్షజేయ ప్రార్థించుచున్నాము. తులసివనములో గంజాయిమొక్క పుట్టవచ్చును. ముండ్లచెట్లమధ్య తియ్యమామిడిచెట్టు పెరగవచ్చును. అందుచే వస్తుగుణతత్వము కనిపెట్టుటకు స్థలవిచక్షణ అవసరములేదు, కావున మా «మూర్తి కేతకీఖారామసాలాను" ఒక్కసారి ఉపయోగించి చూచినచో మామసాలా మంచిచెడ్డలు తమకే విశదము కాగలదు. ఇదిగాక, వక్కలచూరు, తెల్లకాచు, నల్లకాచు, బరంపురం పొత్తిపంచలు, పట్టుగళ్ళరుమాళ్లు (౧ రంగులలోనైనను సరే) సప్లయిచేయుదుము. కాబట్టి ఒక్కసారి ఆర్డరిచ్చిచూడుడు-డాంబిక ప్రకటనల

కు పోనపోకుడు బారీగాఆర్డరిచ్చు వర్తకులకు 'కొంత కిఫాయితీగా యిచ్చెదము. ఇట్లు

సూరు నారాయణమూర్తి

పెద్దబజారు-బంపురం,

(గంజాం)

## శ్రీగణేశ్వర సత్యనారాయణ దండకములు

ఇందు గణేశ్వర, సత్యనారాయణ చరిత్రములు కలవు-ఇది భక్తిరసప్రధానమై, మనోహరములగు భావ పరంపరలు విలసిల్లునటుల మ॥ రా॥ శ్రీ॥ శ్రీ వడగ సుద ర్శనరావుగారిచే రచింపఁబడి రెండవకూర్పునకు సిద్ధము గానేయున్నది. చదువరులకెంతయు నింపుగానుండును.

వెల రు 0-2-0 లు మాత్రమే.

## భక్తవత్సల శతకము

ఇదియొక భక్తిరస ప్రధానమైన శతకము-ఇందలి ప్రతిపద్యము ముద్దులమూటగట్టు శైలితో, అతిమనో హారములగు భావములతో విలసిల్లుచు జదువువారల కపరిమితాహ్లాదకరముగ మరలమరల జదువ బుద్ధిపుట్టు నట్లు మ॥ శ్రీ॥ రా॥ వడగ కౌస్తుభముగారిచే రచింపఁ బడి అప్పుడే రెండవకూర్పునకు సిద్ధమైయున్నది.

వెల 0-4-0 లు మాత్రమే.

వలయువారు,— సెక్రటరి,

"రేచుక్క గ్రంధమాల" బరంపురం (గంజాం)

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 15 | కెంతో | కెంత్రో |
| 4 | 8 | బ్రాచునట్టి | బ్రోచునట్టి |
| 6 | 12 | బావికి | భువికి |
| 6 | 19 | తానమునకైన | భక్తసంతానమునకైన |
| [illegible] | 9 | కనసఖులఁగా | సఖులఁగానక |
| 17 | 22 | చెలిమిఁగాంచి | చెలిమిఁగాంచ |
| 17 | 22 | యోగిఁగనుమా | యోగిఁగనుమ |

N B. 26వ పేజీలో 16వ పంక్తి తరువాత పద్యంలో- "గూల్చితి! యన్ గావుననన్లు నిన్నిపుడ నిన్ ఖాండించి" అనుచోట "గూల్చుబీ! కరమున్ జూపుట నట్లునిన్నిపుడు నే ఖండించి" అని చదువవలెను

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 28 | 10 | బరమాదరముఁజే | బరిమాదరణముఁజే |
| 37 | 8 | యింట్లుండగస | యిట్లుండగన్ |
| 40 | 21 | నమ్మ్రము | నమ్మ్రమా |
| 43 | 4 | ప్రాంగణాంగ | ప్రాంగణాంగణ |
| 47 | 14 | సకల సుభము | సకలశుభములు |
| 48 | 18 | నవ్వదే? న్యాయమా న? | నవ్వద్దో? రాజునగు. నాకు న్యాయమా నే! |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 49 | 13 | దాలవెల్లఁ | దారలెల్ల |
| 54 | 5 | మేంటియయ్యో | మేటియయ్యో |
| 58 | 7 | నదిరించునను | నదరించినను |
| 59 | 20 | నగునే | నగును |
| 60 | 6 | వచ్చినిన్ను | వచ్చునిన్ను |
| 60 | 13 | కాఖ్యముగ | తౌఖ్యముగ |
| 61 | 12 | గలడే | గలఁడె |
| 62 | 15 | వచ్చితివో | వచ్చితివా |
| 63 | 19 | నిర్మితహృదయ | నిర్జితహృదయ |
| 64 | 3 | గారు | గారి |
| 64 | 16 | గారు | గా[illegible] |

ఇంకను-అనేకమైన పొరపాట్లుండ వచ్చును.
కావున పాఠకులు మన్నింపఁ బ్రార్థితులు-గ్రంధకర్త.

# రేచుక్క గ్రంథమాల.

బరంపురం, (గంజాం). పెద్దబజారు వీధి.

**Established in 1927**

1. ఈ గ్రంథమాలలో వత్సరమునకు రెండు గ్రంథములు ప్రచురింపఁబడును.

2. రెండు గ్రంథములు పోస్టేజీతోసహా రు 2/- లకు మించవు. ప్రవేశరుసుము రు 0-2-0 లు మాత్రమే వీ. పీ లోఁ జేర్చఁబడును.

3. మా గ్రంథమాలకు రాజపోషకులుగాను, పోషకులుగాను, సహాయులుగాను, ఉండు మహనీయులకు వీ. పీ. ఛార్జిలను మేమే భరించుకొని ప్రచురింపఁబడు ప్రతిగ్రంథమును బంపుచుందుము. అట్టి మహాశయులు మరిగ్రంథములయొక్క వెల నివ్వనక్కరలేదు.

4. ఇందు ముఖ్యముగాఁ బ్రబంధములు, నవలలు, నాటకములు, పురాణములు వీలయినయెడల మహనీయులు జీవిత చరిత్రములుకూడా ప్రచురించుచుందుము.

5. మా గ్రంథమాలకు 25 గురుని చందాదారులను జేర్చువారిని సహాయులుగా నెన్నుకొని వారికి మా సహాయులకువలెఁ బ్రచురింపఁబడు ప్రతి గ్రంథమును ఉచితముగాఁ బంపుచుందుము.

వడగ కౌస్తుభము,

సెక్రెటరి.

Printed at the "Asha Press," Berhampur.

